కలుగుతాయి. గోపికల కివి లభించి శ్రీకృష్ణుడియందు పరమాత్మ భావం కలిగి ఇలా అంటారు.

"న ఖలు గోపికానందనో భవా౽ఖిలదేహినా మంతరాత్మ దృక్
(శ్రీమద్భాగవతం - 10. 31. 4)

శక్తిశక్తుల సంయోగం సహస్రదళపద్మంలో జరిగిన వెంటనే ఆనంద లహరిలో యోగి విహరిస్తాడు. ఈ విధంగా యోగుల అంతఃకరణలో నిత్యం రాస లీల జరుగుతూనే ఉంటుంది.

రాసలీలకి లాక్షణిక వ్యాఖ్య చేస్తూ స్వామి హరిహరానంద సరస్వతి (కర పాత్రీజీ) శ్రీకృష్ణుణ్ణి తత్‌పదార్థం అనీ గోపాంగనల్ని త్వం పదార్థం అనీ స్వీక రించి వీరి పారస్పరిక క్రీడయే రాసక్రీడ అన్నారు.

(భగవత్తత్త్వం. పుట 218)

ఈయన దృష్టితో భగవంతుడు, గోపికలు కూడా సచ్చిదానంద స్వరూపులే కనుక ఈ లీల అప్రాకృతం. మర్యాదోల్లంఘనం అనే ప్రశ్నే దీనివిషయంలో ఉత్పన్నం కాదు.

వేదవీథిపథికులైన శ్రీ మోతీలాల్‌శర్మ రాసపంచాధ్యాయికి వైదిక పరి భాషలో సమన్వయం చేశారు. గచ్ఛతీతి గౌః అనే వ్యుత్పత్తి ననుసరించి గతి భావమున్న సౌమ్యప్రాణనే పారమేష్య గోతత్త్వరూపంలో గ్రహించారు. గతి ప్రధానమైన గోతత్త్వ సంచారంవల్ల ఈ లోకం గోష్ఠానం అయింది. ఈ గోష్ఠా నానికి సామవేదాన్ని అనుసరించి గోసవం అనే సంజ్ఞ ఉంది. ఇదే పౌరాణిక పరం పరలో గోలోకం. గత్యర్థక వ్రజ్ ధాతువు ననుసరించి వ్రజధామం అయింది. ఇది వ్రజధామంలో అంగిర, భృగుధార ప్రవహిస్తున్నాయి. వీటివల్ల క్రమంగా శబ్దార్థాల సృష్టి జరిగింది. ఈ ధారల్ని క్రమశః సరస్వతి, అంభృణి అన్నారు. పౌరాణిక పరంపరలో అంభృణినే రాధ అన్నారు.

(శ్రీ మోతీలాల్ శర్మ 'సాంస్కృతిక్ వ్యాఖ్యాన్ పంచక్'
పుట 207-210)

ఈ ప్రకారంగా విభిన్న పురాణాలలో రాసలీలా విషయకాలైన భావాల తులనాత్మక అధ్యయనంవల్ల తెలిసేది ఏమిటంటే రాసలీలయొక్క సూక్ష్మ

తత్త్వం హరివంశ బ్రహ్మపురాణ, విష్ణుపురాణాల్లో క్రమవికాసాన్ని పొంది శ్రీమద్భాగవతమహాపురాణంలో పూర్ణరూపంలో వికసితమయింది అని పద్మపురాణ బ్రహ్మవైవర్తపురాణాల్లో ఉత్తర కాలీనమైన ప్రభావం స్పష్టంగా కనబడుతుంది

ఆధిభౌతిక దృష్టితో పరిశీలించి చూచినప్పుడు శ్రీమద్భాగవతపురాణంలో అభివర్ణితమైన రాసలీలావర్ణనవల్ల కృష్ణసంబంధమైన రెండు విషయాలు వ్యక్తమవుతున్నాయి మొదటిది-పరమహంసలి సాధకులికి భక్తులికి సాధనాపద్ధతిని ఉపదేశించడం రెండోది-కామదేవుడి దర్పదళనంవల్ల అతనిపైని విజయప్రాప్తిని పొంది తన పూర్ణావతారాన్ని ప్రమాణితం చెయ్యడం ఈ రెండు ముఖ్య లక్ష్యాలు శ్రీకృష్ణుడు సాధించాడు

శ్రీమద్భాగవతమహాపురాణవక్త జీవన్ముక్తుడు పరమయోగి అయిన శ్రీశుకదేవుడు శ్రోతలు-పరీక్షిన్మహారాజు అసంఖ్యాక పరమహంస శ్రేణులైన మునిజనులు ఇంక పరీక్షిత్తో కేవలగృహస్థుడు కాడు విప్రశాపదగ్ధుడై తన మృత్యువునినాటికేడవనాడు ప్రతీక్షిస్తూ విరక్తుడై ఉన్నాడు ఇంక శుకుడో విరాగి ఈ విరక్తినిచూసి తండ్రి వ్యాసుడంతటివాడు పుత్రా! అని ఘోషిస్తూ వనంలో తిరుగుతూ ఉంటే ప్రతి వృక్షమూ ఆ శబ్దాన్ని ప్రతిధ్వనిస్తూ ఆయన జ్ఞానాన్ని అపహాస్యం చేసిందట! అంటే శ్రీశుకుడెంత విరక్తుడో తెలుస్తుంది

> యం ప్రవ్రజంత మనుపేత మపేత కృత్యం ద్వైపాయనో
> విరహకాతర ఆజుహావ ।
> పుత్రేతి తన్మయతయాతరవోఽ భినేదు స్తం సర్వభూత హృద
> యం మునిమానతోఽస్మి॥ (శ్రీమద్భాగవతం-1, 2 2)

ఇంక శుకుడు గోదోహన కాలం కంటె ఏ గృహస్థు ఇంట ఉండడు స్త్రీ పురుష భేదదృష్టి లేదాయనకి

> "స గోదోహన మాత్రం వా గృహేషు గృహమేధినామ్'
> తదీక్ష్య పృచ్ఛతి మునౌ జగదు స్త వాస్తి। స్త్రీ పుంభి
> దా నతు సుతస్య వివిక్త దృష్టేః ॥
>
> (శ్రీమద్భాగవతం 1 4 85, )

ఈ పరిస్థితుల్లో కామభావన చెయ్యడమే హాస్యాస్పదం

శ్రీమద్భాగవతానికి ఇంకో పేరు పారమహంసీసంహిత ప్రతి అధ్యాయం చివర ఇతి పారమహంస్యాం సంహితాయాం అని ప్రమాణితమై ఉంది అంటే పరమహంసలతో (కు) సంబంధించింది అన్నమాట (పరమహంసానాం ఇయం పారమహంసీ) ఈ విధంగా రాసపంచాధ్యాయి అంతా పరమహంసల కుద్దేశించ బడింది అన్నమాట

శ్రీధరస్వామి రాసపంచాధ్యాయికి టీక వ్రాసేసందర్భంలో మంగళాచరణ శ్లోకంలో ఇలా వ్రాశాడు బ్రహ్మాదిదేవతల్ని జయించడంతో కామదేవుడు దర్పితుడు అయ్యాడు దాన్ని దళనంచేసిన రాసమండం భూషణమయిన శ్రీపతికి జయం అన్నాడు ప్రథమశ్లోకవ్యాఖ్యలో రాసపంచాధ్యాయి సర్వథా నివృత్తి పరమనీ కామదేవుడిపై విజయం సాధించడం రాసక్రీడ ప్రధానోద్దేశమనీ వ్రాశాడు

బ్రహ్మాదిజయ సంరూఢ దర్పకందర్ప దర్పహా ।
జయతి శ్రీపతి ర్గోపీరాసమండల మండనః ॥ (శ్రీధరస్వామి)

తస్మాత్ రాసక్రీడా విడంబనం కామవిజయ స్థాపనాయేత్యేవ తత్త్వమ్ । కించ శృంగారకథాపదేశేన విశేషతో నివృత్తి పరేయం పంచాధ్యాయీ ॥

(శ్రీమద్భాగవతం - 10, 29, 1 టీక)

సామాన్య బుద్ధిననుసరించి కొందరు వ్యక్తులు రాసలీలకి కామవికారాని* సంబంధం కలుపుతున్నారు ఇది పొరపాటు శ్రీమతి బెసెంట్ ఇలా వ్రాసింది

'What but an unclean mind can see aught that is impure in the child dancing as lover and beloved? Let us turn from this, remembering that till the nineteenth century this story provoked only devotion and not ribaldry and it is only with the coming of the grosser type of Western thought that you have these ideas put into the Bhagvat Puran"

—Annie Besant

మొట్టమొదటి విషయం 7 సంవత్సరాలవయస్సులో గోవర్ధనధారణ లీలని ప్రదర్శించాడు శ్రీకృష్ణుడు

క్వ సప్తహాయనో బాల క్వ మహాద్రి విధారణమ్ ।
తతో నో జాయతే శంకా ప్రజనాథ తవాత్మజే ॥
(శ్రీమద్భాగవతం - 10 26 14)

రాసక్రీడార్థం శ్రీకృష్ణుడు అనేకదేహాల్ని ధరించినా దనడానికి నిదర్శనాలు చాలా ఉన్నాయి

అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా ।
ఇత్థమాకల్పితే మండలే మధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందన ॥
(హరివంశ విష్ణుపర్వంలో (20 25) నీలకంఠుడు ఉద్ధరించిన శ్లోకం)

రాసలీలలో శ్రీకృష్ణుడు తన యోగశక్తిద్వారా ప్రతి ఇద్దరి (గోపికల) మధ్యా ఉంటాడు గోపికల పతుల దగ్గర, గోపికల చాపంలోనూ ఉంటాడు

"మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ ప్రజౌకసః' (శ్రీమద్భాగవతం 10, 33, 38)

పౌరాణిక పరంపరలో శ్రీకృష్ణుడు స్వయంగా భగవానుడే

"ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తుభగవాన్ స్వయం '
(శ్రీమద్భాగవతం- 1, 3, 28)

శ్రీకృష్ణుడి పూర్ణావతారం మీద మొట్టమొదట బ్రహ్మకి ఇంద్రుడికి కూడా సందేహం కలుగుతుంది బ్రహ్మ గోవుల్ని గోపబాలకుల్ని దాచివేస్తాడు శ్రీకృష్ణుడు ఒక సంవత్సరకాలం అన్ని రూపాలు తానే ధరించి ఉంటాడు

అంభోజన్మజని స్తదంతరగతో మాయార్భ కస్యేశితు ।
ర్ద్రష్టుం మంజు మహిత్వ మన్యదప తద్వత్సానితో వత్సపాన్॥

నీత్వాన్యత్ర కురూద్వహాంతరదధాత్తే౽పస్థితోయః పురా।
దృష్ట్వాఘాసురమోక్షణం భగవతః ప్రాప్తః పరంవిస్మయమ్॥
తతః కృష్ణో ముదంకర్తుం తన్మాతౄణాంచ కస్యచ।
ఉభయ మిత మాత్మానం చక్రే విశ్వకృదీశ్వరః॥
(శ్రీమద్భాగవతం- 10, 13, 15, 18)

బ్రహ్మకి సందేహంతీరి శ్రీకృష్ణుణ్ణి పరబ్రహ్మ అని గ్రహిస్తాడు ఇంద్రుడికికూడా సందేహంకలిగి పరీక్షగా కుంభవృష్టి కురిపిస్తాడు

స్థూణా స్థూలా వర్షధారా ముంచత్స్వభ్రేషు తీక్ష్ణశః।
జలౌఘైఃప్లావ్యమానా భూర్నాదృశ్యత నతోన్నతమ్॥
(శ్రీమద్భాగవతం 10 25 10)

అప్పుడు శ్రీకృష్ణుడు గోవర్ధనధారణచేసి తన పూర్ణావతారాన్ని స్పష్టం చేస్తాడు

"దధార లీలయ కృష్ణశ్ఛత్రకమివ బాలకః"
(శ్రీమద్భాగవతం 10, 25, 19)

మన్మథుడికి ఈ సందేహం కలుగుతుంది శతకోటి గోపికల యూథంతో ఒక దుర్గరచన జరుగుతుంది కామదేవుడు దీనితో ప్రవిష్టుడవుతాడు శరత్కాల జ్యోత్స్న, కాళిందీపులినం సుగంధసమీరం మొదలైన ఉద్దీపనాలన్నీ కామదేవుడికి అనుకూలంగా ఉంటాయి ఆ పరిస్థితుల్లో శ్రీకృష్ణుడు రాసలీల జరిపి కామదేవుణ్ణి జయిస్తాడు

రాసపంచాధ్యాయిలో ప్రథమశ్లోకం భగవాన్' తో ప్రారంభం అవుతుంది ఇందులో ప్రయోగించబడిన ఉపమానాలన్నీ ఆత్మారామ మన్మథ మన్మథ, యోగేశ్వర మొదలయినవి పరమాత్మకి చెల్లేవి

చిన్న పిల్లవాడు నీటిలోనో అద్దంలోనో తన ప్రతిబింబాన్ని చూసుకొని ఆడుకొన్నట్లే శ్రీకృష్ణుడు రాసలీల చేశాడు అంటుంది పురాణం

రేమే రమేశో వ్రజసుందరీభిర్యథార్భకః స్వప్రతిబింబ విభ్రమః
(శ్రీమద్భాగవతం 10, 33, 17)

రాసపంచాధ్యాయికి ఫలశ్రుతిగా పురాణంలో ఈ శ్లోకం ఉంది

విక్రీడితం వ్రజవధూభిరిదం చ విష్ణోః
శ్రద్ధాన్వితోఽనుశృణుయాదథ వర్ణయేద్యః ।
భక్తిం పరాం భగవతి ప్రతిలభ్య కామం
హృద్రోగమాశ్వపహినోత్యచిరేణ ధీరః ॥
(శ్రీమద్భాగవతం 10, 33 40)

రాసలీలా శ్రవణ మననాదులవల్ల శ్రీకృష్ణ భక్తి కలిగి భక్తుడు హృద్రోగమై పీడించే కామాన్ని శీఘ్రంగా పరిత్యజించ గలుగుతున్నాడు అని ఎందుతార్థం దీన్ని బట్టి రాసలీలా పరమార్థం స్వయంవ్యక్త మవుతోంది గదా !

శ్రీమద్భాగవతంలో - విశేషించి రాసపంచాధ్యాయి లో ప్రకటీకృతమయ్యే గోపీకృష్ణ రతి అప్రాకృతం అని గ్రహించాలి లౌకికజగత్తులోని స్త్రీ పురుష సంబంధానికి పారమహంస సంహిత గా పేర్కొనబడిన శ్రీమద్భాగవతంలోని గోపీజనుల రాగానుగ భక్తికి పోలికలేదు పోల్చాలన భావనే పాపహేతు వని విశుద్ధభక్తులందరూ విశ్వసించేదే ! వీరందరు ఆయన అంతరంగిక భక్తులు దీనిలో చాలావర్గాలకు చెందినవారున్నారు కొందరు సేవకులు కొందరు సఖులు కొందరు వత్సృతుల్యులు, కొందరు ప్రియురాండ్రు ఈ వర్గాలు ఆయా భక్తులను సరించినమార్గాలను బట్టి మనం ఏర్పరుచుకొన్నవి ఈ భక్తులను గూర్చి శ్రీకృష్ణుడే ఇలా అన్నాడు

'న కర్హిచిన్మత్పరాః శాంతరూపే నంక్ష్యంతి నో మేఽనిమిషో
లేఢి హేతిః ।
యేషామహం ప్రియ ఆత్మా సుతశ్చ సఖా గురుః సుహృదో
దైవమిష్టమ్ ॥ (3 25 శ్లో 38)

దీనిలోని మత్పరాః అనే శబ్దం ఆ అనురక్తులనే సూచిస్తుంది అన్నాడు భగవంతుడు వారు నన్ను తమ ఆత్మ అని మిత్రుడని పుత్రుడని స్వామి అని సుహృదుడని, భగవానుడని పరమలక్ష్యమని భావిస్తారు అన్నాడు

వీరిలో తనను హృదయేశ్వరుడని భావించి ఆత్మార్పణం చేసుకొన్న గోపి కలను గూర్చి ఇలా అంటాడు

"న పారయేఽహం నిరవద్య సంయుజాం
స్వసాధుకృత్యం విబుధాయుషాపి వః ।
యామాఽభజన్ దుర్జయగేహ శృంఖలాః
సంవృశ్చ్య తద్వః ప్రతియాతు సాధునా ॥' (10 82, 22 శ్లో)

ఎవరికీ సులభసాధ్యం కాని సంసార శృంఖలాలను తెంచి పారవేసివచ్చి నన్ను సేవించారు నేను మీకు చాలా ఋణపడిఉన్నాను దేవతల ఆయుష్కాల పరిమితిఉన్న కాలంచేత కూడా నేను మీ విషయమైన కర్తవ్యాన్ని నెరవేర్చ లేను అంటాడు అయ

గోపికల భక్తి సర్వోత్కృష్టమైనదని ఆయనే ఇలా అంటాడు

"మయి భక్తిర్హి భూతానామమృతత్వాయ కల్పతే ।
దిష్ట్యా యదాసీన్మత్స్నేహో భవతీనాం మదాపనః ॥"
(10 82, 44 శ్లోకం)

గోపికలకు తన సాక్షాత్కారం వారికి తన యందున్న స్నేహసంపద చేతనే కలుగుతోందని ఆయన కంఠోక్తిగా చెప్తాడు

లౌకిక కామవాసనలేని మధురభక్తికి కాణాచి కావడమే శ్రీమద్భాగవతం లోని దశమస్కంధంలోని రాసపంచాధ్యాయి వైశిష్ట్యం

కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే

# అనుబంధం-3

## అవతారాలు గ్రహాలు దేవీదేవతలు శాంతి ప్రక్రియలు

మనపూర్వుల దృష్టి సమన్వయ దృష్టి భిన్న భిన్నంగా పైకి కనబడే వివిధ విజ్ఞానవిషయాలలో సన్నిహితత్వాన్ని దర్శించి మనకు వాటిలోని ఏకత్వాన్ని చూపించడం వారి సంప్రదాయం ఈ సమగ్రదృష్టితో చూచిన వారికి నవగ్రహాలకు, అవతారాలకు సంబంధం కనబడింది ఈ దృష్టితో పరిశీలించిన పరాశర మహర్షి తన బృహత్పరాశరహోరా శాస్త్రంలో దీని వివరణ కొంత ఇచ్చాడు జ్యోతిశ్శాస్త్రం కూడా వేదైస్సహ సముద్భూతం వేద చక్షు స్సనాతనమ్ అనే వచనానుసారం బ్రహ్మముఖంనుండే ఆవిర్భవించింది కనుక సనాతనం దీనికి వేదచక్షువు అనే గౌరవం కూడా ఉంది మిగిలిన శాస్త్రాలన్నీ అపరోక్షాలుకాగా జ్యోతిషం ప్రత్యక్షం అని పేరు పొందింది ( అపరోక్షాణి శాస్త్రాణి వివాదాస్తేషు కేవలం।ప్రత్యక్షం జ్యోతిషంశాస్త్రం చంద్రార్కౌయత్రసాక్షిణౌ॥ )వేదాంగంగా దీనికున్న ప్రసిద్ధి సర్వవిదితం జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులలో పరాశరమహర్షి ఒకరు స్కంధత్రయాత్మకమైన ఈ శాస్త్రంలో (స్కంధత్రయాత్మకం శాస్త్రమాద్యం సిద్ధాంత సంజ్ఞికమ్।ద్వితీయం జాతకం స్కంధం తృతీయం సంహితాహ్వయమ్॥) ద్వితీయమైన జాతకస్కంధానికి హోరా అని పేరుకూడా ఉంది ఇది ఫలభాగం దీని విషయమై అనేక మహర్షుల గ్రంథాలున్నా కలౌపారా శరీహోరాప్రత్యక్ష ఫలదాయినీ అనే ప్రాచీనులమాట ననుసరించి, ఈ హోరాశాస్త్ర గ్రంథంయొక్క తద్రచయితయొక్క వైశిష్ట్యం తెలుస్తూనే ఉంది ఈ గ్రంథంలో ప్రస్తుతం మనకు మొదటిదైన సృష్టి క్రమకథనాధ్యాయము , రెండవదయిన అవతారకథనాధ్యాయము కావలసినవి వీటి ననుసరించి ఈ విషయమై పరాశరమహర్షి అభిప్రాయాలు అన్నీ అవతారవిషయంలో-ఇతర ఋషులు వెలిబుచ్చిన అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించనక్కరలేదనీ ఏకీభవించలేదనీ ముందుగా గుర్తించాలి అర్వాచీనకాలంలో బయలుదేరిన గ్రంథాలు వెల్లడించిన అభిప్రాయాలకు ఇవికొంత భిన్నంగా ఉండడమూ సముచితమేగదా! ఆయా సంప్రదాయాలకుచెందిన ఆచార్య పురుషుల తాత్త్విక సిద్ధాంతాలకు వీటికి పోలికలు, భేదాలు కూడా ఉండడం

సహజమే అనాది జ్యోతిశ్శాస్త్ర గ్రంథంలో ఇవి చోటుచేసుకోవడం మనపూర్వుల సమ్యగ్దృష్టికి నిదర్శనం ఇదే దృష్టితో దేవతావతారాలకు గ్రహాలకు గల సంబంధాన్ని వివరించారు నవగ్రహాలను గూర్చి ఇలా అన్నారు

'రామోవతారస్సూర్యస్య చంద్రస్య యదునాయక ।
నృసింహో భూమిపుత్రస్య బుద్ధస్సోమసుతస్య చ ॥
వామనో విబుధేజ్యస్య, భార్గవో భార్గవస్య చ ।
కూర్మో భాస్కరపుత్రస్య, సైంహికేయస్య సూకర ॥
కేతోర్మీనావతారశ్చయే చాన్యేతేప ఖేటజా ।
పరాత్మాంశోఽధికో యేషు, తే సర్వేఖేచరాభిధాః ॥

(బృహత్పరాశరహోరా శాస్త్రమ్ అవతారకథనాధ్యాయమ్
శ్లోకములు–5,6,7 సూర్యుడు రాముడు చంద్రుడు కృష్ణుడు
కుజుడు–నృసింహుడు, బుధుడు బుద్ధుడు గురుడు–వామనుడు
భార్గవుడు (శుక్రుడు) పరశురాముడు శని–కూర్మము,

రాహువు–వరాహము కేతువు మీనము వీనికి భిన్నమైనవి కూడా ఖేటజము (గ్రహజము)లే వేనియందు పరమాత్మాంశ అధికమో అవి ఖేచర నామధేయాలు (దేవవాచకాలు)

కొన్ని ఈ అవతారాలలో పరమాత్మాంశపూర్ణంగా ఉన్న అవతారాలు, పూర్ణావతారాలు జీవాంశం అధికంగా ఉన్నవి కొన్ని ఈభేదాలను శ్లోకరూపంలో వివరించడం జరిగింది

ఈ విషయాలన్నీ పరాశరమహర్షి మైత్రేయునకు చెప్పినట్లుంది

"రామః కృష్ణశ్చ భో విప్ర! నృసింహః సూకరస్తథా।
ఏతే పూర్ణావతారాశ్చ హ్యన్యే జీవాంశ కాన్వితాః॥' (శ్లో 2)

(భో విప్ర! (మైత్రేయా–అని సంబోధన)రాముడు, కృష్ణుడు, నృసింహుడు వరాహం–అనే నాలుగు పూర్ణావతారాలు మిగిలిన–మత్స్య, కూర్మ వామన, పరశురామ బుద్ధ, కల్కి అనే అవతారాలలో జీవాంశ అధికం )

జన్మలేనట్టి పరమాత్మ అవతారాలు అనేకం అనీ జీవులకు స్వస్వకృత కర్మఫలాలు ఇచ్చే సూర్యగ్రహాది స్వరూపుడైన జనార్దనుడనే రూప విశేషం ఒకటి ఉందనీ దైత్యనాశనం కోసం దేవబలాభివృద్ధికోసం ధర్మసంస్థాపనకోసం శుభప్రదాలైన అవతారాలు సూర్యాది గ్రహాలవల్ల జన్మించాయనీ పరాశరుని మతం అన్నింటికి వెనుక జనార్దన రూపం నిలిచి ఉన్నదన్న మాట

అవతారాణ్యనేకాని హ్యజన్మ పరమాత్మనః।
జీవానాం కర్మఫలదో గ్రహరూపీ జనార్దనః॥

దైత్యానాం బలనాశాయదేవానాం బలవృద్ధయే।
ధర్మసంస్థాపనార్థాయ గ్రహాజ్జాతా శుభాఃక్రమాత్॥

(శ్లోకాలు 3, 4)

పరాశరుడు సృష్టి క్రమాధ్యాయాన్ని వివరిస్తూ అద్వితీయుడు అవ్యక్త స్వరూపుడు అయిన విష్ణువు అనాది సర్వ ప్రభువు శుద్ధసత్త్వుడు, జగత్స్వామి నిర్గుణుడైనా త్రిగుణాన్వితుడై సంసారకారకుడవుతున్నాడు తన ఏకాంశతో సృష్టి స్థితులను అవలీలగా చేస్తున్నాడు మిగిలిన మూడు పాదాలను (అంశలను) అమృతస్వరూపులు, తత్త్వదర్శనులు అయిన మహానుభావులు తెలుసుకొంటున్నారు అని ఈ విధంగా వ్రాశాడు

"వ్యక్తావ్యక్తాత్మకో విష్ణుర్వాసుదేవస్తుగీయతే।
యదవ్యక్తాత్మకో విష్ణుశ్శక్తి ద్వయ సమన్వితః।
వ్యక్తాత్మకస్త్రిభిశ్శక్తో కథ్యతేఽనంత శక్తిమాన్॥"

వ్యక్తావ్యక్త స్వరూపుడైన శ్రీ మహావిష్ణువు వాసుదేవుడని పిలువబడు తున్నాడు అవ్యక్త స్వరూపుడైన మహావిష్ణువు శక్తిద్వయ సమన్వితుడు వ్యక్తాత్మకుడు శక్తిత్రయ సమన్వితుడు తరువాత ఈవిధంగా పరాశరుడు వివరించాడు

'సత్త్వప్రధానా శ్రీశక్తిః భూశక్తిశ్చరజోగుణా
శక్తి స్తృతీయా యాప్రోక్తా నీలాఖ్యాధ్వాంతరూపిణీ
వాసుదేవశ్చతుర్థోభూత్ శ్రీశక్త్యా ప్రేరితో యదా

సంకర్షణశ్చ ప్రద్యుమ్నోఽనిరుద్ధఇతి మూర్తిధృక్
తమశ్శక్త్యాన్వితో విష్ణుర్దేవ స్సంకర్షణాభిధః
ప్రద్యుమ్నోరజసా శక్త్యా నిరుద్ధః సత్త్వయాయుత 12,13 14

(ఈ శక్తులలో సత్త్వ ప్రధానమైనది శ్రీశక్తి రజోగుణ ప్రధానమైనది భూశక్తి తమోగుణ ప్రధానమైనది నీలాశక్తి ఈ శక్తిత్రయానికి భిన్నుడైన వాసుదేవుడు సత్త్వగుణ ప్రధాన అయి శ్రీశక్తిచేత ప్రేరితుడై-సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ రూపాలను ధరిస్తున్నాడు తరువాత తిరిగి సంకర్షణుడు నీలా శక్తితోను ప్రద్యుమ్నుడు భూ(రజః) శక్తితోను అనిరుద్ధుడు సత్త్వశక్తితోను కూడికొని ఉంటున్నారు )

మహాన్ సంకర్షణాజ్జాతః ప్రద్యుమ్నాద్యదహం కృతిః
అనిరుద్ధాత్స్వయంజాతో బ్రహ్మాహంకారమూర్తి ధృక్
సర్వేషు సర్వశక్తిశ్చ స్వశక్త్యాధికయాయుతః"

(సంకర్షుని వలన మహత్తు ప్రద్యుమ్నునివలన అహంకారము, అనిరుద్ధుని వలన అహంకార స్వరూపుడైన బ్రహ్మ స్వయంగా జన్మించారు వీరు ముగ్గురు పూర్వోక్తశక్తులతో కూడియే ఉన్నారు )

మళ్ళీ అహంకారం- సాత్త్విక (వైకారిక) రాజస (తైజస) తామస(భౌతిక) భేదాలతో ఉన్నది వీనిలోని వైకారికాహంకారం వలన దేవగణం (దిక్కు-, వాయువు, సూర్యుడు మొదలైనవి) తైజసాహంకారం వలన ఇంద్రియగణాలు, తామసాహంకారంవలన భూతాదిగణం(పంచభూతాదులు)ఉద్భవించాయి తరువాత

శ్రీ శక్త్యా సహితో విష్ణుః సదాపాతి జగత్త్రియమ్ ।
భూశక్త్యా సృజతే బ్రహ్మ నీలాశక్త్యా శివోఽత్తి హి॥"

(మహావిష్ణువు శ్రీ శక్తితో కూడి జగత్త్రియాన్ని రక్షిస్తున్నాడు బ్రహ్మ భూశక్తితో కూడి జగత్త్రియ సృష్టి చేస్తున్నాడు శివుడు నీలాశక్తితో కూడి జగత్త్రియాన్ని నాశనం చేస్తున్నాడు )

సర్వజీవులలోను పరమాత్మ ప్రకాశిస్తున్నాడు సమస్త జగత్తు బ్రహ్మ యందు స్థితమైఉంది సమస్త జీవులలోను జీవాంశ పరమాత్మాంశ అనే రెండు

అంశలు ఉన్నాయి కొన్నింటిలో- సూర్యాది గ్రహాలలో బ్రహ్మరుద్రాది దేవత లలో అవతారాలలో-పరమాత్మాంశ అధికం మిగిలిన వాటిలో జీవాంశ అధికం

సూర్యాదయో గ్రహాస్సర్వే బ్రహ్మకామ ద్విషాదయః ।
ఏతేచాన్యేచ బహవ పరమాత్మాంశకాధికాః ॥'

ఈ విధంగా-అవతారాలకు గ్రహాలకు సృష్టిజాతానికి పరమేశ్వరునితో ఉన్న సంబంధాన్ని జ్యోతిషశాస్త్రంకూడా చెప్పింది పరమాత్మాంశ అధికంగా ఉన్న అవతార విశేషాలు ధర్మసంస్థాపనార్థం ఉదయిస్తే (అవి కర్మానుభవం కోసం పుట్టినవికావు సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉన్నట్లు స్థూలదృష్టికి కన బడుతూ ఉన్నా కర్మబద్ధులను తరింపజేయడానికి అవతరించిన భగవద్రూపాలు అవి జీవాంశసంభూతులైన మనుష్యాదులు తమతమ కర్మఫలాదులను అనుభ వించడానికి పుట్టుతున్నారు గ్రహాలకు అవతారాలకు సంబంధం ఉండడంవల్లనే గ్రహానుకూల్యంలేనప్పుడు-ఆయా సంబంధించిన అవతారాల పూజాదికంచేసి వాటి అనుకూల్యాన్ని సంపాదించవలసినదిగా పెద్దలు నిర్ణయించారు దశావతారాల స్తోత్రాదికం (గ్రహశాంతికోసం పఠించవలసినదిగా) బీజాక్షరాలు,మంత్రాలు జపించ వలసినదిగా నియమించారు ఈ సందర్భంలో కవితార్కికసింహ సర్వతంత్ర స్వతంత్ర వేంకటనాథాఖ్య వేదాంత దేశికులవారు వ్రాసిన దశావతార స్తోత్రాన్ని ఉదాహరణగా చెప్పుకోవచ్చును స్తోత్రప్రారంభం ఇలా చేశారు

'దేవో నః శుభమాతనోతు దశధా నిర్వర్తయన్ భూమికాం
రంగే ధామని లబ్ధనిర్భరరసై రధ్యక్షితో భావుకైః ।
యద్భావేషు పృథగ్విధేష్వనుగుణాన్ భావాన్ స్వయం బిభ్రతీ
యద్ధర్మైరిహ ధర్మిణీ విహరతే నానాకృతిర్నాయికా ॥"

తరువాత నవగ్రహాలకు, గుళికునకు మొత్తం పదిశ్లోకాలు వ్రాశారు కేతువునకు మత్స్యావతారం శనికి-కూర్మావతారం, రాహువునకు-వరాహావతారం కుజునకు నృసింహావతారం, గురువునకు-వామనావతారం శుక్రునకు-పరశురామావతారం సూర్యునకు రామావతారం గుళికునకు-బలరామావతారం చంద్రునకు-కృష్ణావ తారం, బుధునకు-కల్క్యవతారం సూచిస్తూ ఆయా అవతారాల వర్ణనాత్మక

శ్లోకాలు వ్రాశారు తరువాత అన్ని గ్రహాలను సూచించిన అవతారాలనన్నింటిని కలిపి సమాహారంగా ఒక శ్లోకంలో వర్ణించారు

"ఇచ్ఛామీన, విహారకచ్ఛప, మహాపోత్రిస్య ద్యచ్ఛాహరే
రక్షావామన, రోషరామ కరుణాకాకుత్స్థ హేలాహలిన్
క్రీడావల్లవ, కల్కివాహన దశాకల్పిన్నితి ప్రత్యహం
జల్పంతః పురుషాః పునంతు భువనం పుణ్యౌఘ పణ్యాపణాః॥"

(రక్షావామన అనేదానికి మాయావామన పాఠాంతరం)

ఫలశ్రుతిగా ఇది వ్రాశారు

"విద్యోదన్వతి వేంకటేశ్వరకవౌ జాతం జగన్మంగళం
దేవేశస్యదశావతార విషయం స్తోత్రం వివక్షేత యః।
వక్త్రే తస్య సరస్వతీ బహుముఖీ భక్తిః పరామానసే
శుద్ధిః కాపి తనౌ దిశాసుదశ సుఖ్యాతిశ్శు భాజృంభతే॥"

శ్రీ పరాశరుల గ్రంథానికి, శ్రీ వేదాంత దేశికుల స్తోత్ర విషయానికి కొన్ని భేదాలు కనబడుతున్నాయి పరాశరుల గ్రంథంలో గుళికు ప్రస్తావన లేదు శ్రీ వేదాంత దేశికుల స్తోత్రంలో బలరామునితో గుళికునకు సంబంధం ఉంది గుళికుని ప్రస్తావన లేకపోవడంతో బాటు బలరాముని ప్రస్తావనకూడా పరాశరుని గ్రంథంలో లేదు శ్రీవేదాంత దేశికుల స్తోత్రంలో బుద్ధుని ప్రస్తావన లేదు! పరాశరుని గ్రంథంలో ఉంది!

పరమేశ్వరుని (శ్రీమన్నారాయణుని) అవతారాలకు ఆయన సృష్టియే అయి కర్మఫలాన్ని ఇచ్చే గ్రహాలకు సంబంధం ఉండడం సముచితం ఇందువల్ల ఆ పరాత్పరుని వివిధావతారాల ప్రార్థనాదులవల్ల గ్రహానుగ్రహం కలగడం నిజానికి ఆయన అనుగ్రహం అన్నమాట సహజమూ సర్వసమ్మతం

మనపెద్దలు ప్రత్యేకంగా దేవతలను పేర్కొని ఆయా దేవతల అనుగ్రహం వల్ల గ్రహదోషాలుతొలగిపోతాయి అని చెప్పడంలోను ఈ ధర్మసూక్ష్మమే ఉంది ఆ దేవతలందురు ఆ పరమేశ్వరుని విభిన్న వ్యక్తరూపాలే అనే విశ్వాసం దీనికి

పునాది సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి అనే సూక్తి వెనుకనున్న పరమార్థం ఇదే!

యా విద్యా శివకేశవాది జననీ అని వర్ణిత అయిన ఆ జగజ్జనని పాదార విందసేవ నవగ్రహ దోష నివృత్తి కోసం అవశ్యకర్తవ్యమనీ అది సంపూర్ణఫల దాయిని అని చెప్పారు. ఆమె పాదపద్మాలయందే గ్రహాల లక్షణాలనన్నింటిని సమన్వయపరిచి వాటి సంసేవనంవల్ల గ్రహదోషాలు నివృత్తి అవుతాయిఅని వర్ణించారు. ఇలాంటి వాటిలో మూకపంచశతి లోని పాదారవిందశతకం లోని క్రింది శ్లోకాన్ని పేర్కొనవచ్చును

దధానో భాస్వత్తా మమృత నిలయో లోహితవపుః
వినమ్రాణాం సౌమ్యో గురురపి కవిత్వంచ కలయన్।
గతౌమందో గంగాధర మహిషికామాక్షి భజతాం
తమః కేతుర్మాతస్తవ చరణపద్మో విజయతే॥

జగజ్జనని గంగాధర మహిషి కామాక్షిపాద పద్మాలు నవగ్రహ లక్షణ లక్షితాలైనట్లుగా భావితాలై వర్ణితాలైనవి ఆ పాదపద్మాలు-భాస్వతను (కాంతిని సూర్యగ్రహం) అమృతత్వాన్ని (చంద్రగ్రహం) లోహితత్వాన్ని (ఎఱ్ఱదనాన్ని-కుజగ్రహం) వినమ్రుల ఎడల సౌమ్యత్వాన్ని (బుధగ్రహం) గురుత్వాన్ని (గురుగ్రహం) కవిత్వ ప్రదానత్వాన్ని (శుక్రగ్రహం) గతిమందత్వాన్ని (శనైశ్చర గ్రహం) తమస్సునకు కేతుత్వాన్ని (అగ్నితేజస్సును-కేతురాహువులు రెండూ పాదద్వయం చెప్పినట్లే) ధరించి (పొంది) సర్వాతిశాయులై ఒప్పుతున్నాయి-అని స్థూలార్థం ఇందువల్ల ఆమె చరణ పద్మసేవ గ్రహదోష నివృత్తికారకమన్న మాట!

ఇదే విధంగా శ్రీశంకరభగవత్పాదులు సౌందర్యలహరిలో దేవీ నేత్రత్రయాన్ని వర్ణించిన శ్లోకం నవగ్రహ దోషనివృత్తి కోసం జపించవలసినదిగా పెద్దలు చెప్పుతారు ఆ శ్లోకం ఇది

'అహస్సూతే సవ్యం తవ నయనమర్కాత్మకతయా
త్రియామాం వామంతే సృజతి రజనీనాయకతయా।

తృతీయాతే దృష్టిర్దరదళిత హేమాంబుజ రుచిః
సమాధత్తే సంధ్యాం దివసనిశయోరంతరచరీమ్॥

(శ్లోకం 48)

చతురశ్రంలోని తొమ్మిది గళ్ళల్లోను తొమ్మిది గ్రహాలను నిరూపించుంది దీని యంత్రం. ఆ తల్లిదక్షిణనేత్రం సూర్యాత్మకంగనుక పగటిని జనింప జేస్తోంది. వామనేత్రం చంద్రాత్మకం గనుక రాత్రిని జనింపజేస్తోంది. లలాట నేత్రం వహ్న్యాత్మకం గనుక ఉభయ సంధ్యలను జనింపజేస్తోంది. దీనివల్ల ఆమె కాలాన్ని శాసించేది అని ధ్వని ప్రధానంగా వ్యక్తంచేయడం జరిగింది. త్రికాలాల్ని శాసించే ఆమెకు కాలావచ్ఛేద్యత్వం దూరమైనది. ఈ శ్లోక వ్యాఖ్యలో శ్రీ లక్ష్మీధరుడు ఇలా వ్రాశారు.

'అత్రసూర్యచంద్రాగ్న్యాత్మకనయన త్రయేణ భగవత్యాః అవయవ విశేషేణ (అవయవరూపేణ) దివసనిశాసంధ్యాత్మక కాలత్రయోపలక్షితపక్షమాసర్తుయుగకల్పాదికాలోత్పత్తి కథనాత్ భగవత్యాః కాలావచ్ఛేద్యత్వం దూరత ఏవాపాస్త మితిధ్వన్యతే'

గ్రహాదులు కాలాన్ని అనుసరించిపోయేవే. కాలశాసకురాలైన ఆమె కనుసన్నల ఆవి మెలగవలసినవే! ఆమె అనుగ్రహం లభించినప్పుడు గ్రహదోష నివృత్తి కలుగుతుంది. ఈ శ్లోకానికి యంత్రం నవగ్రహ యంత్రమే.

శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలో- 'కరాంగుళినఖోత్పన్న నారాయణ దశాకృతిః' అనే నామం (80) ఉంది. శ్రీదేవితో యుద్ధం చేస్తున్న భండాసురుడు సర్వాసురాస్త్రం అనేదాన్ని ప్రయోగించగా దానినుండి సోమక, రావణ, బలి, హిరణ్యాక్షాది రాక్షసులందరు పుట్టి యుద్ధము చేయసాగారు. అప్పుడు దేవి తన కుడి ఎడమచేతుల వ్రేళ్ళగోళ్ళనుండి శ్రీమన్నారాయణుని దశావతారాలను సృష్టించి ఆ రాక్షసులను నాశనం చేయించింది. ఈ నామానికి వ్యాఖ్య వ్రాస్తూ శ్రీభాస్కరరాయలు ఇలా అన్నారు.

'కరాంగుళ్యో దక్షవామ కరద్వయస్య అంగుళ్యః దశతాసాం నఖసంధిషు ఉత్పన్నస్య నారాయణస్య దశాకృతయః మత్స్యాది దశావతారాయస్యాస్సా। భండాసురేణ సర్వాసురాస్త్రం నామసకల

దైత్యోత్పాదన మస్త్రం సర్వాసురాస్త్రం ప్రయుక్తం। తేన సోమక రావణబలి వారణ్యాక్షాదయ ఉత్పన్నాః సంతః అయుధ్యస్త। తతో దేవ్యాదక్షహస్తాంగుష్ఠాది వామహస్త కనిష్ఠికాంతాంగుళినఖేభ్యః క్రమేణ మత్స్యకూర్మ వరాహ నారసింహవామన భార్గవదాశరథి హాలధర కృష్ణ కల్కిరూప దశావతారానుత్పాద్యతే నిషూదితా ॥

అయితే సమస్త విషయాలను వేదాంతపరంగా సమన్వయించడం ఒక సంప్రదాయంలో ఉంది గనుక ఈ విధానాన్ని కూడా అవలంబించి శ్రీ భాస్కర రాయలు పక్షే అని చెప్పి ఇలా వ్రాశారు

జీవసంబంధిన్యో జాగ్రదాదయోవస్థాః పంచేశ్వర సంబంధీని సృష్ట్యాదీని కృత్యాని పంచేత్యేవం దశాకృతయోఽనఖ మాత్రేణోత్పన్నాః భవన్తీఅ అనాయాసేన ఉత్పద్యంత ఇత్యత్ర తాత్పర్యం । నారాయణశబ్దో జీవేశ్వరయోరుపలక్షక । దశా శబ్దో అవస్థాపరః । కృతిశబ్దః కృత్యపరోవా॥

ఇంకోపక్షంలో– జీవసంబంధమైన జాగ్రత్స్వప్న సుషుప్త్యాది పంచావస్థలు (పై మూడింటికీ తురీయ తురీయాతీతములను రెండింటిని కలపాలి) ఈశ్వర సంబంధమైన సృష్ట్యాది పంచకృత్యాలు (సృష్టి, స్థితి లయ అనుగ్రహ తిరోధానములు) కలిసి పది ఇవన్నీ సునాయాసంగా జగజ్జననినఖాగ్రాలనుండి ఉద్భవించాయి అని తాత్పర్యం నారాయణ శబ్దం జీవేశ్వరుల్ని తెలుపుతుంగి దశా శబ్దాన్ని అవస్థనుగా కృతి శబ్దాన్ని కృత్యపరంగా గ్రహించవచ్చును

మానవ జీవితంలో గ్రహాల అనుకూల్యం లేనప్పుడు శాస్త్రిలు చెప్పిన శాంతి క్రియలన్నీ-దేవతావతారలకు గ్రహాలకు గల సంబంధాన్ని పురస్కరించుకొని పుట్టినవే గ్రహాలు స్వయంగా చేసేది ఏమీలేదు మానవకర్మఫలాన్ని పరమేశ్వరుని నిర్దిష్టానుసారం మానవులచేత అనుభవింపజేసేవి గ్రహాలు మానవులు గ్రహాలకు చేసే శాంతిక్రియలన్నీ వాటిద్వారా ఆ పరమేశ్వరునకే చెందుతాయి ఇందువల్ల ఆ పరమేశ్వరుని లేదా ఆ పరమేశ్వరి లేదా ఆయా అవతారాల లేదా

ఆయా దేవతామూర్తుల వివిధాంశాలుగ్నా వారి అర్చనాదికం వల్ల ప్రత్యవాయాలు తొలగిపోతాయి అనే విశ్వాసం ఈ శాంతి క్రియలకు పునాది దృఢకర్మ అదృఢ కర్మ అని కర్మను రెండు విధాలుగా సామాన్య విభజన చేశారు అదృఢకర్మ ద్వారా వచ్చే ప్రత్యవాయాదికం ఈ శాంతి క్రియలవల్ల పూర్తిగా తొలగి పోవచ్చును ధృఢకర్మ వల్ల వచ్చే ప్రత్యవాయాదికం పూర్తిగా తొలగిపోక పోయినా వాటి దుష్ఫలితాల తీవ్రత తగ్గిపోతుంది నాభుక్తం క్షీయతేకర్మ అన్నట్లు కొంత అనుభవింపవలసివస్తుంది కర్మానుభవం తప్పదన్నా, దుష్కర్మ ఫలాన్ని అనుభవిస్తూ ఉన్నప్పుడు శాంతిక్రియలను గూర్చి ఆలోచిస్తాము సుకర్మ ఫలాన్ని అనుభవిస్తూ ఉన్నప్పుడు దాన్ని గురించి పట్టించుకోము ఇదే విధంగా సుఖప్రారబ్ధం దుఃఖప్రారబ్ధం అని కూడా అన్నారు సామాన్యుడు కష్టాలు అనుభవిస్తూ ఉన్నప్పుడే ఇది నా ప్రారబ్ధం అనడం ఉందికని సుఖాన్ని అనుభవిస్తూ ఉన్నప్పుడు ఇది నా ప్రారబ్ధం అని సామాన్యంగా అనడు! ఇందు వల్ల ప్రారబ్ధం అంటే అది ఏదో కష్టానికి సంబంధించిన మాటగా అర్థం వాడుక లోనికి వచ్చింది!

కర్మానుభవంలోని వైవిధ్యం వివిధ గ్రహాలరాశుల కారకత్వాలను బట్టి తెలుస్తూ ఉంటుంది లేదా, వివిధ గ్రహాల రాశుల కారకత్వాల ననుసరించి ఆయాకర్మ ఫలాలు అనుభవంలోకి వస్తాయి అంటే ఆయాకర్మ ఫలాలను అనుభవించవలసివచ్చిన వ్యక్తికి, ఆయాగ్రహాలు తదనుగుణంగానే జన్మకుండ ల్యాదులలో ఆశ్రయాన్ని పొంది ఉంటాయి అన్నమాట అయితే మహాపురుషుల అనుగ్రహాదులు పొందిన లేదా పరమేశ్వరానుగ్రహం సాధించిన వ్యక్తిని‌– దుస్థానాలలో ఉన్నగ్రహాలు కూడా ఏమీచేయలేవు అనే విశ్వాసం ఒకటి ఉంది ఇది అంతా విధి విలాసమే కాదని మానవ ప్రయత్నం కూడా ఒకటి ఉందని రుజువు చేస్తుంది ఈ యుగంలో అర్షకవి అనిపేరు పొందిన కావ్యకంఠ శ్రీవాసిష్ఠ గణపతి మునులు (1878 1936) తమ 'ఉమాసహస్రం అనే కావ్యంలో ఇలా అంటారు

"అద్రి తనయాంఘ్రిజల జన్మహృదయేస్యాత్ ।
అష్టమగతోఽపి విదధాతురవిజః కిమ్॥"

ఇదే విధంగా, పూర్వకవి ధూర్జటి తమ శ్రీకాళహస్తీశ్వర శతకంలో ఇలా అంటారు

గ్రహదోషంబులు, దుర్నిమిత్తములు నీకల్యాణ నామంబుఁ బ్ర
త్యహముం బేర్కొను నుత్తమోత్తముల బాధం బెట్టఁగా నోపునే
దహనుం గప్పఁగఁజాలునే శలభసంతానంబు, నీ సేవఁజే
య హతక్లేశులుగారు గాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా!
(పద్యం 29)

భక్తి ప్రపత్తులతో పరమేశ్వరానుగ్రహం సంపాదిస్తే కర్మజాతాలైన సమస్త దోషాలు నివృత్తి అవుతాయి అని మనవారి దృఢవిశ్వాసం. ఏకం సత్ విప్రా బహుధా వదంతి అని తెలిసినా – లేదా, ఆవిధంగా తెలియడంవల్లనే అందాం– బహునామరూపాదులతో పరాత్పరుణ్ణి అర్చించడం మన సంప్రదాయం! ఇష్ట దేవత అనే భావానికి వెనుక అంతర్గతంగా ఉన్నది ఇదే। మనం ఏరూపంలో అర్చించినా–నామరూపరహితుడు మన పరిమితత్వాన్ని గుర్తించి మనకు ప్రసన్ను డవుతాడని మన విశ్వాసం. నిర్గుణుడైనా – లేదా కొన్ని సంప్రదాయాలవారు భావించేవిధంగా సమస్త కల్యాణగుణ సంపన్నుడైనా– మనం అర్చించె మూర్తికి చేసిన పూజాదికమంతా ఆ సత్పదార్థానికే చెందుతుందని – ఆ నిర్గుణునకే ఆ సమస్త కల్యాణగుణ సంపన్నునకే చెందుతుందని–శాస్త్రాలు తెలిసినా తెలియక పోయినా మనవారందరి విశ్వాసం. అద్వైత సంప్రదాయానికి చెందిన స్మార్తులు చేసే పంచాయతన పూజకు వెనుకనున్న అంతరార్థం ఇదే! మన పూజావిధానంలోని వైవిధ్యం దేవతాబాహుళ్యం నేటి– అన్య ధర్మానుయాయులైన వారికి మనవాళ్ళలో పాశ్చాత్య వాసనా వాసితులై కొందరు ఆధునికులకు –అర్థంకాని విషయం! తాత్త్వికంగా ఆయనకు ఆమెకు దానికి అనే మూడు దృక్పథాలు సనాతనమతంలో ఉన్నాయి! పరమేశ్వరుడు తండ్రే (Father) ఎందుకు కావాలి అని మనవారు ఏనాడో ప్రశ్నవేసుకొన్నారు. శక్తి (తల్లి–Mother) పూజ ఏనాడో వచ్చింది! లింగవివక్ష ఎందుకు? అనుకొన్నారు– సత్పదార్థం వచ్చింది! ఒకే విద్యుచ్ఛక్తి వివిధోపకరణాల (ఉపాధుల) ద్వారా ప్రసరించి– పరస్పర విరుద్ధాలైన చన్నీళ్లు వేణ్ణీళ్లు గాలి వెలుతురు ఇంకా ఎన్నో–సమకూర్చి పెట్టుతోంది గదా! ఇదేవిధంగా ఒకే భగవచ్ఛక్తి మన ప్రార్థనాదికాన్ని కరుణతో ప్రేమతో– మన్నించి మనకు సమస్త విషయాలను – చిట్టచివరికి మోక్షం కూడా–ప్రసాదిస్తుందని మనవారి దృఢవిశ్వాసం! ఈ ప్రార్థనాదికానికి సర్వులు–

లింగవివక్ష లేకుండ, కులమతవివక్ష లేకుండా— అర్హతే అనేది ముఖ్యవిషయం మనం చూపించే వివక్షలు అన్నీ మనం కల్పించుకొన్నవే గాని వస్తుతః ఉన్నవి కావని ప్రాజ్ఞులందరూ ఒప్పుకొన్న విషయమే।

మన సనాతన సంప్రదాయంలో ఆ భగవచ్ఛక్తికి ఒక ప్రయోజనాల దృష్ట్యా వివిధ నామరూపాదులు కల్పించుకొని దాన్ని అర్చించుకొంటున్నామనే అపరిమితమైన ఆశక్తి మన పరిమితత్వాన్ని గుర్తించి లేదా క్షమించి-

('యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవభజామ్యహమ్

ఎవరు ఏ భావంతో నన్ను ఉపాసిస్తున్నారో నేను వారిని అదేవిధంగా అనుగ్రహిస్తున్నాను భగవద్గీత—అధ్యాయం 4, శ్లోకం—11) మనల్ని అనుగ్రహిస్తుందని-అనుగ్రహిస్తోందని మన విశ్వాసం ఈ శ్లోకం ఉత్తరార్థం ఈ విషయాన్ని స్పష్టం చేసింది (మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః— అర్జునా! మనుష్యులు సర్వవిధాలుగా నా మార్గాన్ని అనుసరిస్తున్నారు) గాఢమైన ఈ విశ్వాసం వల్ల, సనాతన సంప్రదాయాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించేవారు తమ సంప్రదాయంలోని పరమేశ్వరుని నామరూపవైవిధ్యాన్ని వివిధ పూజావిధానాన్ని అంగీకరించినట్లే-అన్య ధర్మానుయాయుల ఆచార వ్యవహారాదులను విశ్వాసాదులను అర్థంచేసుకోగలుగుతున్నారు మానవులలో సహనం పెంపొందడానికి ఇది ఒకే ఒక మార్గం। ఇది మనకు ఉగుపాలతో సంక్రమించినదే। దీనికి విరుద్ధ ప్రవృత్తి-సనాతన సంప్రదాయ విహితం కాదు! దేశకాల పాత్రానుసారంగా—ఇతరులను చూచి మనం తెచ్చిపెట్టుకొన్నది అవుతుంది!

గ్రహాదులకు చేసే శాంతి క్రియలకుగాని విశ్వశ్రేయస్సును కోరి చేసే యజ్ఞయాగాదులకు గాని, వ్యక్తిగతాలైన ప్రత్యవాయాలు తొలగిపోవడానికి చేసే జప తపాదులకు గాని వెనుక గర్భితంగా ఉన్న విశ్వాసం- పరమేశ్వరుడు విశ్వరూపుడు విశ్వగర్భుడు అనే విశ్వాసం ఈ విరుద్ధాంశాల యుగపద్భావం పరమేశ్వరునకే సాధ్యం అనే విశ్వాసం-అని గుర్తించాలి అప్పుడు అంతా అర్థమవుతుంది! సమస్త శాంతిక్రియలకు వినియోగపడే మంత్రాదికం-'వేదపురాణేతిహాస తాంత్రిక గ్రంథాదులనుండి మాత్రమే గాక - మహాపురుషుల, మహాభక్తుల మహాకవుల రచనాదులనుండి గ్రహించడం కూడా ఉంది వేదవేదాంగ పారీణుడు యోగా

గమ మంత్రజ్యోతిషశాస్త్ర పారంగతుడు మహావాగ్గేయకారుడు అయిన శ్రీముత్తుస్వామి దీక్షితులవారు (1776-1835) లోకానుగ్రహ దృష్టితో నవగ్రహ కీర్తనలు రచించారు ఈ రచనలకు వెనుక ఈ కథ ప్రచారంలో ఉంది దీక్షితులవారి శిష్యుడైన శుద్ధమద్దళం తంబియప్పగారనే ఆయన శూలనొప్పితో బాధపడుతూ ఉండి వైద్యం చెయించుకొన్నా అది నయంకానప్పుడు జ్యోతిష్కులను సంప్రదించగా వారు ఆయన కప్పుడు గురు శనిగ్రహాల అనుకూల్యం లేదని చెప్పారుట!

ఈ విషయం గురువుగారికి మనవి చేసుకొనగా దీక్షితులవారు- గురుగ్రహం మీద అఠాణ రాగంలో (త్రిశ్రత్రిపుట తాళం) బృహస్పతే అనే కృతిని శనిగ్రహం మీద యదుకుల కాంభోజి రాగంలో (ఏకతాళం) దివాకర తనూజం అనే కృతిని రచించి ఇచ్చి వాటిని భక్తిశ్రద్ధలతో అనేక పర్యాయాలు గానం చేయవలసిందిగా సెలవిచ్చారుట! తంబియప్పగారు అవిధంగా చేయగా అబాధానివృత్తి కలిగిందట ! తరువాత దీక్షితులవారు మిగిలిన గ్రహాలమీద కూడా కృతులు వ్రాశారు ఈ కృతులలో మొదటి ఏడు-శూలాది సప్తతాళాలలో ఉన్నాయి పల్లవిలో గ్రహముద్ర, అనుపల్లవిలో చరణాలలో ఆయా గ్రహాల అధిపత్యాలు, కారకత్వాదులు రూపరేఖలు వస్త్రాద్యలంకారాలు శత్రు మిత్రాదుల వివరణలు, దశల సంవత్సరాలు మొదలైన జ్యోతిషశాస్త్ర విషయాలుండి దీక్షితులవారి జ్యోతిషశాస్త్ర పారంగతత్వాన్ని తెలియజేస్తాయి కర్ణాటక సంగీతంలోని లయ విన్యాసం తద్వారా లభించే మాధుర్యాధికం శూలాది సప్తతాళాల పునాదులపై నిర్మితమైన మహాప్రాసాదం గదా ! మహావాగ్గేయకారులైన దీక్షితులవారి పనికి పూనుకొన్నప్పుడు ఆ మాధుర్యాధికాన్ని గురించి ఇంక చెప్పేదేముంటుంది ! సంస్కృతభాషలో నిష్ణాతులైనవారి భాషాపాటవాన్ని గురించిగాని వారి జ్యోతిష శాస్త్ర పరిజ్ఞానాన్ని గురించి గాని వేరే చెప్పవలసింది లేదు మంత్రశాస్త్రవేత్తలైన వారు సముచిత శబ్దసంపుటితో వ్రాసి గానంచేసిన ఈ కృతులు, ప్రత్యవాయ నిరోధకాలుగా పనిచేసే శాంతిక్రియలుగా వ్యవహరించాయి అనేది ఇక్కడ మనకు ప్రాసంగికమైన విషయం!

గురు శనులపైనే గాక మిగిలిన గ్రహాలపై వారు వ్రాసి గానంచేసిన కృతులు ఇలా ఉన్నాయి సూర్యగ్రహం మీద సౌరాష్ట్ర రాగంలో (ధ్రువతాళం) 'సూర్యమూర్తే నమోఽస్తుతే అనే కృతిని, చంద్రగ్రహం మీద అసావేరిరాగంలో

(మిశ్రతాళం) చంద్రం భజమానస అనేకృతిని కుజ గ్రహంమీద సురటి రాగంలో (రూపకతాళం) అంగారకమాశ్రయామ్యహం అనే కృతిని బుధ గ్రహంమీద నాటకురంజి రాగంలో(ఝంపతాళం) బుధమాశ్రయామి అనే కృతిని (గురుగ్రహం మీది కృతిని తెలుసుకొన్నాము) శుక్ర గ్రహంమీద పరజురాగంలో (అటతాళం) శ్రీశుక్ర భగవంతం చింతయామి అనే కృతిని (శనిగ్రహం మీది కృతిని తెలుసుకొన్నాము) రాహు గ్రహంమీద రామ మనోహరిరాగంలో (రూపక తాళం) స్మరామ్యహం సదా రాహుం అనే కృతిని కేతుగ్రహం మీద చామర రాగంలో (రూపకతాళం) మహాసురం కేతు మహం భజామి అనే కృతిని శ్రీదీక్షితులవారు గానంచేశారు ఆయా గ్రహాల అనుగ్రహంకోసం ఆయా వాసరాలనాడు వాటిని గానంచేసి లాభంపొందడం నేటికీ కనబడుతూనే ఉంది!

ఇదేవిధంగా శ్రీదీక్షితులు తిరువారూరు (శ్రీపురం)లో వెలసి ఉన్న శ్రీత్యాగరాజస్వామివారి మీద సర్వవిభక్తి కృతులను గానంచేసినట్లే, అక్కడి అమ్మవార్లయిన - శ్రీకమలాంబ మీద, శ్రీనీలోత్పలాంబమీద కూడా కృతులు గానం చేశారు స్థానికంగా ప్రచారంలో ఉన్న ఐతిహ్యానుసారం - శ్రీ కమలాంబాదేవి రూపం శివుని వివాహం చేసుకోవడానికి తపస్సు చేస్తున్న స్థితిని తెలియజేస్తుందని, వివాహమైన తరువాతి స్థితిని శ్రీ నీలోత్పలాంబా దేవిరూపం తెలియజేస్తుందని - మనకు తెలుస్తోంది ఈ ఇద్దరు అమ్మవార్లమీద గానంచేసిన కృతులు సర్వవిభక్తి కృతులు కాగా శ్రీ కమలాంబాదేవిమీద చెప్పిన కృతులు నవావరణ కీర్తనలు గా ప్రసిద్ధిపొందాయి

శ్రీ దేవీపూజా దురంధరులైన శ్రీ దీక్షితులవారు శ్రీచక్రార్చన చేసే సందర్భంలో ప్రతి ఆవరణలోని దేవతలను, చక్రాన్ని వర్ణిస్తూ గానంచేసిన నవావరణ కీర్తనలు తొమ్మిది, మొట్టమొదటి ధ్యానకృతి ఒకటి, చివరి మంగళహారతి రూపమైన కృతి ఒకటి మొత్తం పదకొండు కృతులు - ఈ సంపుటిలో ఉన్నాయి సంస్కృతంలోని- ఎనిమిది విభక్తులు (సంబోధనతో కలిపి) వచ్చేలాగ ఎనిమిది కీర్తనలు తొమ్మిదవ కీర్తన సార్వవిభక్తికం అయ్యేలా చూడడం - అనే నియమాన్ని కూడా శ్రీ దీక్షితులవారు పాటించడంవల్ల-ఈ నవావరణ కీర్తనలు పదకొండు అయ్యాయి శ్రీ విద్యోపాసకులు, మంత్రతంత్ర శాస్త్రవేత్తలు అయిన శ్రీ దీక్షితులవారు ఈ కీర్తనలలో తమ ఆగమశాస్త్ర పాండిత్యాన్ని భక్తితో మిళితం

చేస కృతులు రచించి పాడి మనఎదుట ఆ లలితాపరాభట్టారికను శ్రీచక్రరాజ నిలయను శ్రీలలితాత్రిపురసుందరిని సాక్షాత్కరింపజేశారు ఈకృతులలో లలితా సహస్రనామ లలోని కొన్ని నామాలు లలితోపాఖ్యానంలోనివికొన్ని సప్తశతి లోని నామాలుకొన్ని దేవీ భాగవతాదులలోని నామాలుకొన్ని - చోటుచేసుకొన్నాయి ముఖ్యంగా శ్రీదేవి ఖడ్గమాలావిధానంలోని శ్రీచక్ర నవావరణపూజ-ఈ కృతులనువిన్నా పాడినా స్ఫురిస్తుంది కర్ణాటక సంగీతాబ్ధిలో ఎయలువెడలిన అమృతకలశ ద్రవ్యాలు ఈ కృతులు ప్రతి కృతి సర్వాంగసుందరమైన దేవీ మూర్తిని మనఎదుట ప్రత్యక్షం చేస్తుంది

మొట్టమొదటిది ధ్యానకృతి తోడిరాగం (రూపకతాళం) లోని ఈ కృతి కమలాంబికే ఆశ్రితకల్పలతికే చండికే అని ప్రారంభిస్తుంది అనుపల్లవి తరువాత చరణం వచ్చి చిట్టచివర అకచట తపాదివర్ణే, అఖండైకరసపూర్ణే అని ముగుస్తుంది అ-క-చ-ట-తపాది అనడంవల్ల అ క చ-ట త ప య అనే వర్గాలలోని అన్ని అక్షరాలు వర్ణమాల అంతా - చెప్పినట్లయింది జగజ్జనని సూక్ష్మమంత్రాక్షర రూపిణిగనుక బీజాక్షరాలతో కూడిన సమస్తమంత్రాలు ఆమె రూపంగా చెప్పినట్లయింది ఆమె మాతృకా వర్ణరూపిణి, సకలే గురుగుహకరణే సదాశివాంతఃకరణే అనే పాదంలో శ్రీ దీక్షితులవారిముద్ర గురుగుహ వచ్చింది శ్రీ శంకర భగవత్పాదులు తమ ప్రపంచ సారతంత్రమ్ అనే తంత్రగ్రంథంలో ఈ అ-క చ ట త ప-య లను గూర్చి ఇలా చెప్పారు

"అ క చ ట త ప యాద్యైః సప్తభిర్వర్ణవర్గైః
విరచితముఖ బాహా పాదమధ్యాఖ్య హృత్కా ।
సకల జగదధీశా శాశ్వతా విశ్వయోనిః
వితరతుపరిశుద్ధిం చేతన శ్శారదావః ॥

మంత్రతంత్ర శాస్త్రవేత్తలైన శ్రీ దీక్షితులవారు శ్రీ భగవత్పాదులపై శ్లోకాన్ని గ్రహించినవారు గనుకనే తమ నవావరణ కృతుల ధ్యానకృతిలో అకచటతపాదివర్ణే అని శ్రీదేవిని కమలాంబికను ధ్యానించారు శ్రీ శంకర భగవత్పాదుల శారద కమలాంబికయే! ఆశ్రితకల్పలతికయే ! అఖండైక రస పూర్ణయే !

శ్రీ కాళిదాసు తమ పంచ స్తవిలోని లఘుస్తుతి లో మాతృకా వర్ణరూపిణి అయిన జగజ్జననికి అసంఖ్యాకమైన నామాలున్నాయి అని సూచించారు

అ ఈః పల్లవితైః పరస్పరయుతైః ద్విత్రిక్రమాద్యక్షరై
కాద్యైః క్షాంతగతైః స్వరాదిభిరథ క్షాంతైశ్చతైస్సస్వరైః।
నామాని త్రిపురే భవంతిఖలుయాన్యత్యంత గుహ్యానితే
తేభ్యోభైరవ పత్ని! వింశతి సహస్రేభ్యః పరేభ్యో నమః॥'
(శ్లోకం 19)

ఈ విధంగా ఏర్పడే అసంఖ్యాక నామాలలో ఏ నామంతో ఆమెను స్మరించినా ఆమె ప్రీతిని పొందుతుంది కనుక లలితా సహస్రనామాలలో ఆమెను నామ పారాయణప్రీతా అని సంబోధించడం జరిగింది తన నామపారాయణ ప్రీతిని పూర్వపీఠికలో ఇలా వ్యక్తంచేసింది ఆ జగన్మాత!

పశ్చాన్నామసహస్రం మే కీర్తయే న్మమతుష్టయే।
మామర్చయతు వా మావా, విద్యాంజపతు వానవా॥ (శ్లో 45)

"కీర్తయేన్నామ సాహస్రమిదం మత్ప్రీతయే సదా।
మత్ప్రీత్యాసకలాన్ కామాన్ లభతే నాఽత్రసంశయః॥(శ్లో 46)

ధ్యాన కృతి తరువాతి కీర్తన—ఆనందభైరవి రాగంలో ప్రథమావిభక్తిలో 'కమలాంబా సంరక్షతు మాం' అనే కృతివస్తుంది ఇది కృతులలో రెండోది అయినా నవావరణ కీర్తనలలో మొదటిది ఆరోహణక్రమంలో మొదటి ఆవరణ భూపురం దీనిలో మూడువిభాగాలున్నా సమష్టి భూపురం చతురస్రా(శ్రా)కృతి దీనికి త్రైలోక్య మోహనచక్రం అని పేరు కీర్తనలో క్షితిపురత్రైలోక్య మోహన చక్ర వర్తినీ ప్రకటయోగినీ' అని వస్తుంది ఈ కృతిలోని మధురిపుసహోదరీ' అనేది లలితాసహస్రనామాలలోని పద్మనాభసహోదరీ'' (208 నామం) అనే నామాన్ని స్ఫురణకు తెస్తుంది ద్వితీయావరణ కృతి, కల్యాణిరాగంలో (ఆది తాళం) ద్వితీయావిభక్తిలోని ''కమలాంబాం భజరే'' అనేది ఈ ఆవరణకు ''సర్వాశాపరిపూరక చక్రం' అని పేరు జగజ్జననిని 'సర్వాశా పరిపూరకచక్ర స్వామినీం, పరమశివ కామినీం'' అని కీర్తించడం జరిగింది త్రిపుర సుందరి

కమలావాణీ సేవితపార్శ్వాం అని చెప్పబడింది లలితా సహస్రనామాలలోని సచామర రమావాణీ సవ్య దక్షిణసేవితా (614 నామం) అనే దాన్ని జ్ఞప్తికి తెస్తుంది త్రిపురసుందరి (ఇక్కడ కమలాంబిక) అనుగ్రహం ఉంచే - లక్ష్మీ సరస్వతులు—మనఇంట కాపురముంటారు అన్నమాట దీనిలో దుర్వాసార్చిత గుప్తయోగినీం—అని ఉంది దేవీ భక్తులలో దుర్వాసమహర్షి ప్రసిద్ధులు ఈ ఆవరణలోని దేవతలకు గుప్తయోగినులని పేరు వారందరు శ్రీదేవీ స్వరూపణులు- క్రోధ భట్టారకులనే పేరున్నవీరు శ్రీదేవీ మహిమ్నః స్తోత్రమ్ రచించారు దీనికే శ్రీత్రిపురామహిమ్నః స్తుతి అనీ శ్రీశక్తిమహిమ్నః స్తుతి అనీ కూడా పేర్లు (అవతారతత్త్వవివేచన—పుటలు 33 34 35)

తృతీయావరణకృతి శంకరాభరణం రాగంలో (రూపకతాళం) తృతీయా విభక్తిలోని శ్రీకమలాంబికయా కటాక్షితోఽహం' అనేది ఈ ఆవరణ అష్టదళ పద్మం ఆవరణదేవత త్రిపురసుందరి దీనికి సర్వసంక్షోభిణీ చక్రం అని పేరు అరుణవర్ణ సంక్షోభణ చక్రాకారయా అని చరణం దీనిలోని ఒక చరణంలో మూకముఖ్యవాక్ప్రదయా అని ఉంది కామాక్షీదేవి కరుణవల్ల వాక్కు వచ్చి మూక పంచశతి'' వ్రాసిన కవిప్రస్తావన ఇది దేవీ ఉపాసకులలో మన్మథుడొకడు ఇక్కడ అనంగా ద్యుపాసితయా అష్టదళాబ్జ స్థితయా అని ఉంది దేవీ ఉపాసకులు పన్నెండుమంది మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః అగస్త్యరగ్ని సూర్యశ్చ ఇంద్రస్కందశ్శివస్తథా। క్రోధభట్టారకో దేవ్యాద్వాదశామీ ఉపాసకాః॥

నాలుగో ఆవరణకృతి కాంభోజి రాగంలో చతుర్థీ విభక్తిలో ఉన్న కమలాంబికాయై కనకాంశుకాయై కర్పూరవీటికాయై నమస్తే నమస్తే అనేది ఈ ఆవరణకు సర్వసౌభాగ్యదాయక చక్రం అని పేరు దీన్ని చతుర్దశారం అంటారు ఈ చక్రానికి ఈశ్వరి త్రిపురవాసిని దీనిలో సకల సౌభాగ్యదాయ కాంభోజ చరణాయై అని ఉంది ఇదిగాక కమలాకాంతానుజాయై అని కూడా ఉంది అన్నింటిలోలాగే దీనిలో కూడా సగుణసాకార నామాలు నిరాకారనామాలు, శ్రీచక్రసంబంధనామాలు ఉన్నాయి ఈ సకల సౌభాగ్యదాయ కాంభోజ చరణాయై అనే పదబంధం, శ్రీశంకరభగవత్పాదుల సౌందర్యలహరిలోని-

భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛా సమధికం।
శరణ్యేలోకానాం తవహి చరణావేవ నిపుణౌ॥ (శ్లో—4)

అనే పాదాల్ని జ్ఞప్తికితెచ్చి, సమస్తఫలాలను అవే ఇస్తాయని నిరూపిస్తోంది

ఐదో ఆవరణ కృతి భైరవిరాగంలో (ఝంప తాళం) పంచమీ విభక్తిలో ఉన్న శ్రీ కమలాంబికాయాః అనేది దీనికి బహిర్దశారం అని పేరు దశకోణా కృతి దీనిది ఇది సర్వార్థసాధక చక్రం దీనికి అధిష్ఠాత్రి త్రిపురా శ్రీః చక్రం పేరు కృతిలో గురుగుహ మోదిత సర్వార్థ సాధకపూర్తేః అని ఉంది సంవి ద్రూప అయిన పరాశక్తి యొక్క జ్ఞానేంద్రియపంచకం కర్మేంద్రియపంచకం కలిసి సర్వసిద్ధిప్రదాది దేవతలై ఇక్కడ ఉన్నారు (ఆ పది ఇవి-సర్వసిద్ధి ప్రద సర్వసంపత్ప్రద సర్వప్రియంకరి సర్వమంగళకారిణి సర్వకామప్రద సర్వదుఃఖ విమోచని సర్వమృత్యుప్రశమని సర్వవిఘ్ననివారిణి సర్వాంగ సుందరి సర్వసౌభాగ్యదాయిని) ఈ కృతిలో నిర్ద్వంద్వంగా శ్రీదేవియొక్క వైశిష్ట్యం పదర్శితమైనది అనేకాలైన ముఖ్యవిషయాలు చెప్పి వాటికి ఆధారమైన శ్రీదేవికంటె పరమైనది లేదని శ్రీ దీక్షితులు దీనిలో ప్రకటించారు

పల్లవిలో శ్రీ కమలాంబికాయాః పరం నహి అని స్పష్టంగా చెప్పి— తరువాత అనుపల్లవిలో, చరణాలలో తత్కారణాలను వివరించారు ఉదాహరణగా ఒకటి రెండు శ్రీకంఠవిష్ణువిరించ్యాది జనయిత్ర్యాః శివునకు, విష్ణువునకు బ్రహ్మకు తల్లి అయిన ఆమెకంటె తరువాత సేవిత భైరవీ భార్గవీ భారత్యాః భైరవి భార్గవి భారతులచేత సేవింపబడుతున్న శ్రీదేవికంటె— అభేద నిత్యశుద్ధ బుద్ధముక్త సచ్చిదానంద, పరమాద్వైత స్ఫూర్తేః' అభేద నిత్యశుద్ధ బుద్ధముక్త సచ్చిదానంద పరమాద్వైతస్ఫూర్తి అయిన శ్రీదేవికంటె — ఇన్నిచోట్ల — పరం నహి అని అన్వయించుకోవాలి శివునకు విష్ణువునకు, బ్రహ్మకు తల్లి అన్న వెంటనే, రాజరాజేశ్వరీ స్తోత్రంలోని యావిద్యా శివకేశవాదిజననీ అనేది జ్ఞప్తికి రాకమానదు!

ఆరో ఆవరణకృతి పున్నాగవరాళి రాగంలో (రూపకతాళం) షష్ఠీవిభక్తిలో కమలాంబికాయాస్తవ భక్తోఽహమ్ అనేది దీనిలోని విషయాలన్నీ దేవీస్తోత్ర సాహిత్యంతో పరిచయం ఉన్నవారికందరికీ తెలిసినవే! శ్రీచక్రదృష్ట్యా ఈ ఆవర

ణకు అంతర్దశారం అని పేరు సర్వరక్షాకరచక్రం ఈ విషయాన్ని శ్రీదీక్షితుల వారు ఇలా సెలవిచ్చారు దశకలాత్మక వహ్నిస్వరూప ప్రకాశాంత ర్దశార సర్వరక్షాకర చక్రేశ్వర్యాః భువనమోహిని అయిన త్రిపురసుందరిని వర్ణించ డంలో ఈ కృతిలో శ్రీ దీక్షితులవారు తమ కవితాప్రాగల్భ్యాన్ని చూపించారు అనుపల్లవిలో— సుమశరేషు కోదండపాశాంకుశ పాణ్యాః అతిమధురతర వాణ్యాః శర్వాణ్యాః కల్యాణ్యాః రమణీయపున్నాగవరాళి విజితవేణ్యాః అన్నారు పూల బాణాలు చెఱుకువిల్లు పాశాంకుశాలు మొదలైనవాటి ప్రస్తావన సాధారణం అన వచ్చును కాని జగన్మాత వేణిని గూర్చి కృతిరాగనామాన్నికూడా చేర్చి రమ ణీయ పున్నాగవరాళి (భ్రమరసమూహం) విజితవేణ్యాః తుమ్మెదల సమూహాన్ని జయించిన రమణీయమైనవేణి కలిగినటువంటి అందం చాలా సొగసుగాఉంది లలితాసహస్రనామాలలోని కొన్ని నామాలు ధ్యానశ్లోకాలలోని వర్ణనలు అన్నీ గుర్తుకువస్తాయి దశముద్రా సమారాధిత కౌళిన్యాః అన్నవెంటనే లలితాసహస్ర నామాలలోని దశముద్రా సమారాధ్యా (నామం 977) అనేది కౌలినీ (నామం 94) అనేది స్ఫురించకమానవు శ్రీవిద్యలోని ప్రసిద్ధముద్రలు - సర్వసంక్షోభిణి సర్వవిద్రావిణి సర్వాకర్షిణి సర్వవశంకరి సర్వోన్మాదిని సర్వమహాంకుశ సర్వఖేచరి సర్వబీజ సర్వయోని సర్వత్రిఖండ—అను వి ఈముద్రాదేవతలచేత ఆరాధింపబడేది శ్రీదేవి ఇలాంటి కమలాంబిక భక్తుడను నేను ( భక్తోఽహమ్ ) అంటారు శ్రీ దీక్షితులవారు

ఏడవ ఆవరణకృతి, శహనరాగంలో (త్రిపుటతాళం) సప్తమీ విభక్తిలో శ్రీకమలాంబికాయాం భక్తిం కరోమి అనేది ఇది అష్టకోణ చక్రం సర్వరోగ హర చక్రం అని పేరు ఇక్కడ ఎనిమిదిమంది వాగ్దేవతలుంటారు వారు వశినీ కామేశ్వరీ మోదినీ విమలా అరుణా జయినీ కౌళినీ సర్వేశ్వరీ—అనేవారు చక్రే శ్వరి—త్రిపురాసిద్ధాంబ వీరు రహస్యయోగినులు ఈ ఎనమండుగురు అ క చ ట త ప—య—శ—అనే వర్గాది వర్ణ స్వరూపాలుకలవారు ఈ కృతినిబట్టి శ్రీకమ లాంబికయే చండిక అని స్పష్టమవుతోంది చండిక అనగా దుర్గాదేవి ఆమె జగ న్మాత ఇది గాక కమలాంబిక కరధృతవీణావాదిని అని చెప్పడంవల్ల ఆమె రాజశ్యామల కూడా

'కరస్ఫురిత వల్లకీం, కలితకంబు తాటంకినీం ।
ఘనస్తన భరోల్లసద్గళిత చూళికాం శ్యామలామ్ ॥'

అని ఆమె వర్ణన ఉంది కమలానగర వినోదినీం అని చెప్పడం చేత దీక్షితులవారి ఊరైన తిరువారూరు కు కమలానగరం (దేవినిబట్టి కావచ్చును) అనే పేరుకూడా ఉన్నట్లున్నది ఈ కృతిలో హ్రీం కారం నాలుగుసార్లు ప్రయోగించబడింది ఇక్కడే ఆమె గౌరి గౌర్యాం) అని కూడా చెప్పబడింది త్రిశతిలో 'హ్రీం తో నామాలు అరవై (60) ఉన్నాయి పంచదశి మంత్రంలో హ్రీం కార త్రయం, ఆ బీజాక్షర ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది హ్రీం భువనేశ్వరి మంత్రబీజం కూడా! శక్తి ప్రణవ పంచకంలో హ్రీంకారం రెండోబీజం అవ్యక్తం మాయాబీజం, శబల బ్రహ్మవాచకం శివశక్త్యైక్య స్వరూపం పరమేశ్వరి హ్రీం కారమే స్వరూపంగా కలది లలితా సహస్రనామాలలో 301వ నామం హ్రీంకారి అనేది ఇది శివశక్త్యాత్మకమైంది శక్త్యక్షరాణి సర్వాణి హ్రీంకార ఉభయాత్మకః (బ్రహ్మాండపురాణం)

'హకారస్స్థూలదేహస్స్యాద్రకారస్సూక్ష్మదేహకః ।
ఈకారః కారణాత్మాసౌ, హ్రీంకారోఽహం తురీయకమ్॥"

ఓంకారం బ్రహ్మవాచకమైనట్లే హ్రీంకారం శక్తివాచకం తైత్తిరీయంలో హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ అని ఉంది గదా!

ఎనిమిదో ఆవరణకృతి ఘంటారాగంలో (ఆదితాళం) సంబోధన ప్రథమావిభక్తిలో శ్రీకమలాంబికేఽవావ శివే కరధృతశుకశారికే అనేది సంబోధన ప్రథమావిభక్తి సప్తమీ విభక్తి తరువాత చెప్పడం సంప్రదాయం ఈ ఆవరణకు త్రికోణచక్రం అని పేరు ఇదే సర్వసిద్ధిప్రదా చక్రం ఈ త్రికోణచక్రానికి—మహాకామేశ్వరీ, మహావజ్రేశ్వరీ మహాభగమాలినీ అనే వారు కోణత్రయదేవతలు అతిరహస్యయోగినులు ఆవరణ దేవతలు ఇక్కడ త్రిపురాంబికే బాలాంబికే అనే సంబోధనలు విశిష్టమైనవి దీనిలోని త్రిపురాంబ అష్టావరణ అధిష్ఠాత్రి ఇంక బాలాంబవిషయం బాలా బీజాలు—ఐం (వాగ్బీజం) క్లీం (కామరాజబీజం) సౌః (సోమరాజ (పరా) బీజం) అనేవి ఈ మూడు అష్టమావరణ త్రికోణాలలో ఉన్నాయి ఇందువల్ల సమస్త అష్టమావరణ త్రికోణచక్రం బాలాంబారూపం ఈ బీజత్రయంలోని ఐం ఋగ్యజుస్సామవేదాల ప్రథమమంత్రాల ప్రథమాక్షరాల కూర్పువల్ల ఏర్పడిందని విజ్ఞుల భావన ఋగ్వేదం నుండి—అ (అగ్నిమీడే పురోహితమ్)— యజుర్వేదం నుండి—ఇ (ఇషేత్వోర్జేత్వా) సామవేదంనుండి —అ

(అగ్న ఆయాహివీలయే) అథర్వవేదం నుండి బిందోళ్ళంనోదేవీరితి ఈ ప్రథమాక్షరాలు బిందువు కలిసి ఐం ఏర్పడింది ఇది వేదచతుష్టయ స్వరూపం పరాపశ్యంతీ మధ్యమావైఖరీ స్వరూపమైన శబ్ద బ్రహ్మాత్మకం అని అన్నారు ఇదేవిధంగా క్లీం శివస్వరూపం అన్నారు సౌః అనేది అభిన్నార్థాని తెలియజేస్తుందని నిర్ణయించారు తంత్రశాస్త్రవిదులు ఐం క్లీం సౌః అనేది అహం బ్రహ్మాస్మి అనీ సౌః క్లీం ఐం అనేది బ్రహ్మైవాహమస్మి అనీ తేల్చారు

ఈ మూడింటినిగూర్చి ఈ శ్లోకం ఇలా చెప్తోంది

'వాగ్భవం ప్రథమం బీజం ద్వితీయం కామరాజకం।
తృతీయం శక్తిబీజాఖ్యం నిగమత్రితయో ద్భతమితి॥
(తృతీయస్తు పరాబీజమితి పాఠాంతరం)

కాళిదాసమహాకవి తాము రచించిన దేవీ పంచస్తవిలోని లఘుస్తవంలో మొదటిశ్లోకంలోనే- మొదటిపాదం మొదటి అక్షరంగా ఐం ను రెండో పాదం రెండో అక్షరంగా క్లీం ను, మూడోపాదం మూడో అక్షరంగా సౌ ను కూర్చి బాలామంత్ర బీజాక్షరాలను శ్లోకబద్ధం చేసి-సంప్రదాయ పద్ధతిలో ప్రకటించారు

"ఐంద్రస్యేవ శరాసనస్య దధతీ మధ్యేలలాటప్రభాం
శౌక్లీం కాంతిమనుష్ణ గోరివశిరస్యా తన్వతీ సర్వతః।
ఏషాఽసౌ త్రిపురాహృది ద్యుతిరివోష్ణాంశోస్సదాహస్థితా
ఛింద్యాన్నస్సహసాపదైస్త్రి భిరఘం జ్యోతిర్మయీ వాఙ్మయీ॥"

శ్రీ శంకరభగవత్పాదులు తమ సౌందర్య లహరి లో పంచదశీమంత్రాన్ని శివశ్శక్తిః కామః అనే శ్లోకంలో (32) సంప్రదాయసిద్ధమైన గూఢ పద్ధతిలోనే ప్రకటించారు పంచదశీ మంత్రంలోని ఆ యా అక్షరాలకు సంకేతంగా తంత్రశాస్త్రం అంగీకరించిన పదాలు ప్రయోగించి ఆ యా అక్షరాలను స్ఫురింపజేశారు ఆ శ్లోకం ఇది

శివశ్శక్తిః కామః క్షితిరథ రవిశ్శీతకిరణః
స్మరోహంసశ్శక్ర స్తదను చ పరామారహరయః।

అమీహ్యల్లేఖాభిస్తి స్సృభి రవసానేషుఘటితా
భజన్తే వర్ణాస్తే తవజనని నామాంగయవ తామ్॥ (శ్లోకం 32)

దీనిలో శివః = 'క' ను శక్తిః = ఏ ను, కామః = 'ఈ' ని, క్షితిః = 'ల ను రవిః = 'హ ను, శీతకిరణః = స ను స్మరః = క ను హంసః = 'హ ను శుక్రః = ల ను- పరా = స ను మార = క ను తెలియజేస్తాయి దీనినిబట్టి ఇంతవరకు మంత్రంలోని క, ఏ ఈ, ల అనువర్ణాలు హ స క హ ల అనువర్ణాలు స క ల అనువర్ణాలువచ్చి మూడుఖండాలు ఏర్పడ్డాయి తరువాత- అమీహ్యల్లేఖాభిస్తిస్సృభిరవసానేషుఘటితాః అనడంవల్ల- ఈ మూడు ఖండాలలో ప్రతిఖండంలో చివర హ్రీం చేరి- క ఏ, ఈ ల హ్రీం- హ స క హ ల హ్రీం- స క ల హ్రీం- అని ఏర్పడి- జగజ్జనని నామావయవాలుగా రూపొందాయి ఇదే పంచదశీ మంత్రం లేదా పంచదశాక్షరి మంత్రం మాతృకామంత్రం త్రిఖండమై- సోమ సూర్యానలాత్మకమై ఒప్పుతోంది

మంత్ర బీజాక్షరాలను ప్రత్యక్షంగా చెప్పక మార్గాంతరంలో సూచించడం శంకరభగవత్పాదుల శ్లోకంలో కనబడుతుంది కాళిదాస మహాకవి ఆ అక్షరాలను శ్లోక బద్ధం చేశాడు కాని వాటిని అర్థవంతమైన మాటలలో భాగాలుగా చేసి వాటి గూఢత్వాన్ని కొంత పరిరక్షించాడు 'ఐం' అనేబీజాన్ని ఇంద్రస్యేవ శరాసనస్య దధతీ అనే రీతిలో ప్రయోగించి ఇంద్రధనుః ప్రకృతిలో దాన్ని గూఢం చేశాడు బీజాక్షరాలను హల్లులతో కలిపిగాని కలపకగాని జపిస్తే (భక్తితో జపించడం ముఖ్యం గనుక) ఫలితం ఉండకపోదని మంత్రశాస్త్రం చెప్పుతోంది వాగ్భవ బీజాలను కేవలం అచ్చులుగా ఉచ్చరించినా ఐం, ఈం ఔః- అని (హల్లులను తొలగించి) ఫలితం ఉంటుందని శ్రీదేవీ లఘుస్తవంలో ఆరో శ్లోకంలో దేవీ భక్తుడైన కాళిదాస మహాకవి ఇలా వర్ణించాడు

ఏకైకం తవదేవి! బీజమనఘం సవ్యంజనా వ్యంజనం
కూటస్థం యదివా పృథక్క్రమగతం యద్వాస్థితమ్ వ్యుత్క్రమాత్,
యంయంకామ మపేక్ష్యయేన విధినా కేనాఽపి వాచింతితం
జప్తంవా సఫలీకరోతి సతతం తంతం సమస్తం నృణామ్॥"

హల్లులు (వ్యంజనం) లేకుండా— ఐం ఈం ఔః అని గ్రహిస్తే అది శుద్ధవిద్య అవుతుంది వాగ్భవ బీజంలోని బిందువును విడిచివేసి తల్లిని ఎలుస్తున్నాననే భావంతో ఐ అని మాత్రమే ఉచ్చరిస్తూ బాల్యంలోనే మరణించిన ఒక బాలుడు ఐ అని ఉచ్చరించిన దాని పుణ్యఫలంగా మరు జన్మలో హారీతుని కొడుకైన సుమేధునిగా జన్మించి పరశురాముని శిష్యుడై ఆయన తన గురువైన శ్రీ దత్తాత్రేయుని ద్వారా గ్రహించిన పరావిద ను బోధించగా ధన్యుడైనాడు దీని కథ ఇది

సరస్వతీ నదీ తీరంలో ఉన్న సుమంతుడనే ఋషికుమారుడు అలర్కుడనే వాడు తండ్రి తల్లిని బాయి ఆయి అని ఎలవడం విని తానుకూడా తల్లిని ఆయి - ఐ అని ఎలవడం మొదలుపెట్టాడు ఐ అవేది బిందువుచేరి ఐం కాకపోయినా దేవికి ఇష్టమైన బీజం పసతనంలోనే చనిపోయిన ఈ బాలునినోటి నుండి మరణశయ్యమీద ఐ అనేదే వెలువడింది కాని వాగ్భవ బీజాన్ని బిందువు లేకుండా ఐ అనిమాత్రం ఉచ్చరించిన దాని ఫలితంగా ఆ విద్యను విస్మరింపగా నారదుని ప్రార్థననుసరించి బ్రహ్మదానిని తిరిగి ఉపదేశిస్తాడు అప్పుడు సుమేధుడు ఆవిద్యను త్రిపురారహస్యం గా మాహాత్మ్య జ్ఞాన చర్యాఖండాలుగా రచిస్తాడు దీనికి హారీతాయన సంహిత అని పేరుకూడా ఉంది బ్రహ్మ ఆజ్ఞను నారం నారదుడే దీన్ని మొదటిసారి పఠించి ధన్యుడవుతాడు ఇప్పుడు మూడో భాగం (చర్యాఖండం) అలభ్యం మాహాత్మ్యఖండంలోను మార్కండేయపురాణం లోను లక్ష్మీతంత్రంలోను దుర్గాసప్తశతిలోను వర్ణితాలైన దుర్గా కాళీ లక్ష్మి, సరస్వతి లలిత కుమారి మొదలైన దేవ్యవతారాల మాహాత్మ్యాలే కనబడతాయి త్రిపురా రహస్యం— ఓం నమః అని ప్రారంభమై శ్రీ త్రిపురైవ హ్రీం అని ముగుస్తుంది నిర్గుణ బ్రహ్మకు సంకేతమైన ఓం తో ప్రారంభించి పరాశక్తికి సంకేతమైన హ్రీం తో ముగిసే త్రిపురారహస్యం అద్వైత గ్రంథాలలో తలమానికమైనదని శ్రీరమణమహర్షులు (1879-1950) తరుచుగా అనేవారని తెలుస్తోంది! బీజాక్షరాలకున్న శక్తిని తెలిపే ఐతిహ్యం ఇది

శ్రీ దీక్షితులవారి ఈ అష్టమావరణకృతిలో కరాంగుళినఖోదయవిష్ణు దశావతారే అని ఉంది శ్రీలలితా సహస్రనామాల లోని కరాంగుళినఖోత్పన్న నారాయణ దశాకృతిః (నామం 80) అనేదాన్ని జ్ఞాపకం చేస్తుంది ఇదిగాక చివరి రెండు చరణాలు

'అంత కరణేక్షుకార్ముక శబ్దాది పంచతన్మాత్ర విశిఖాత్యంత।
రాగపాశద్వేషాం కుశధరకరేఽతిరహస్యయోగిని పరే॥'

అనేవి శ్రీ లలితా సహస్రనామాలలో – మనోరూపేక్షు కోదండా (నామం-10) పంచతన్మాత్రసాయకా (నామం-11) రాగస్వరూపపాశాఢ్యా (నామం 8) క్రోధాకారాంకుశోజ్జ్వలా (నామం-9) అనే నామాలను స్మృతికి తెస్తాయి- ఈ కృతిలో కూడా కరధృతశుక శారికే అని ఉంది ఇక్కడ శుకం (చిలుక) శారిక-వీణను మీటడానికి ఉపయోగించే ఉపకరణం (కొడుపు) వీటిని ధరించే దేవి శ్రీ శ్యామలాదేవి ఈమె మంత్రిణ్యంబ ఈమెకు ఎనిమిది రూపాలున్నాయి ఈ రూపాల నామాలముందు విశేషణాలుగా లఘు వేణు వీణా శారిక శుక రాజ హసంతి మహా-అనేవివచ్చి ఆమె పేరు శ్యామలాంబ చేరుకుంది లఘుశ్యామల రాజశ్యామల మహాశ్యామల మొదలైనవి ఉద్భవిస్తాయి వీటి కన్నింటికి ప్రత్యేకంగా మంత్రాలు ఉపాసనామార్గాలు ఉన్నాయి మంత్రతంత్ర శాస్త్రవేత్తలైన శ్రీ దీక్షితుల వారికి ఇవన్నీ కరతలామలకాలు మంత్రాలన్నీ వాచో విధేయాలు అనాలి జగజ్జనని కటాక్షం పుష్కలంగా ఉన్న మహామనీషులు వాగ్గేయకారులలో అగ్రేసరులు

ఇంక తొమ్మిదో ఆవరణ కృతి ఆహిరిరాగంలో (త్రిశ్ర ఏకతాళం) సార్వవిభక్తికమైన శ్రీ కమలాంబా జయతి అనేది ఈ ఆవరణ ఆకృతిబిందు రూపం ఇది ఎనిమిదో ఆవరణమైన త్రికోణంలో మధ్యబిందు రూపంలో ఉంటుంది దీనికి సర్వానందమయచక్రం అనే పేరు శ్రీ త్రిపుర సుందరీదేవి చక్రేశ్వరి ఆవరణదేవత పరాపరరహస్యయోగిని శ్రీ రాజరాజేశ్వరీ పరాభట్టారిక చక్రాధిష్ఠాత్రి దీనితో ప్రాకట్యపరాపరయా అనిఉంది తొమ్మిది ఆవరణ దేవతలకు యోగినులని పేరు మొదటి ఆవరణలోనివారు ప్రకటయోగినులు తొమ్మిదో ఆవరణ దేవత పరాపరయోగిని ప్రాకట్యపరాపరయా అనడంలో అందరు యోగినులు వచ్చేస్తారు సామూహికంగా! స్థూలంగా ఆదిరస్త్రే సహితా అనే దాన్ని అన్వయించ వచ్చును

దీనిలోని దేవీ నామాలన్నీ ప్రసిద్ధమంత్ర శాస్త్రగ్రంథాలలోను, శ్రీలలితా సహస్రనామాది స్తోత్రాలలోను వచ్చేవే! శ్రీ దీక్షితులవారికి మంత్రతంత్రశాస్త్ర వాఙ్మయం అంతా కొట్టిన పిండే అని ఈ నవావరణకీర్తనలు తెలుపుతాయి

శ్రీదేవి సంగీతరసిక మాతృకావర్ణ రూపిణీ—ఒక వైపు సంగీతం, రెండో వైపు సాహిత్యం; జగజ్జననితత్త్వాన్ని పూర్ణంగా గ్రోలిన శ్రీ దీక్షితులవారు తమ కృతులలో ఆ ప్రావీణ్యాన్ని అడుగడుగున చూపించారు! ఈ కృతిలోని శ్రీమాత్రే నమస్తే అనేది శ్రీ లలితాసహస్రనామాల ప్రారంభాన్ని తెలియజేస్తుంది. చింతామణి మందిరస్థ అనేది చింతామణి గృహాంతఃస్థా (నామం 57) అనే నామాన్ని శివాకారమంచస్థిత అనేది శివాకారేమంచే పరమ శివపర్యంకనిలయాం అనే సౌందర్యలహరి శ్లోక (8) భాగాన్ని శివకామేశాంకస్థా అనేది శివకామేశ్వరాంకస్థా అనే సహస్రనామాలలోని 52వ నామాన్ని స్మృతికితెస్తాయి ఈ కృతిలో మళ్ళీ ద్వాదశభిరుపాసితకాదిహాది సాది మంత్ర రూపిణ్యాః అని చెప్పి దేవీభక్తులైన పన్నెండుగురను స్మరించడంతో బాటు ప్రసిద్ధదేవీ విద్యలైన– కాది హాది సాది విద్యల ప్రస్తావ కూడా తెచ్చి వాటి ప్రాముఖ్యాన్ని ప్రకటించడం జరిగింది ఈ పన్నెండు మంది మంత్రద్రష్టలే! వీరివల్లనే భిన్నభిన్న సంపుటులతో మంత్రాలు ఏర్పడ్డం జరిగింది బ్రహ్మమయ ప్రకాశిని నామరూపవిమర్శిని అనేవి రెండూ ఉపనిషత్తులు ప్రవచించిన వేదాంత విషయాలను ప్రస్తావించాయి వీటిలో బ్రహ్మరూపవివక్ష చేసే–అస్తి(ఉంది) భాతి (ప్రకాశిస్తోంది జ్ఞానం) ప్రియం (ఆనందం) అనేవి– బ్రహ్మమయ ప్రకాశిని అనే దానివల్ల నామరూపవిమర్శిని అనేదానివల్ల నామరూపాలతో విద్యమానమయ్యే జగద్రూపవివక్షను చేసినట్లయింది ఛాందోగ్యాది ఉపనిషద్విజ్ఞానం అంతా తాంత్రిక ఆలోచనా విధానమంతా ప్రీతి యుక్తమచ్చిత్తం విలయతు బ్రహ్మమయ ప్రకాశినీ నామరూప విమర్శినీ। కామకళా ప్రదర్శినీ సామరస నిదర్శినీ॥ అనే రుచిర పదబంధాలలో రూపొందించారు

సార్వవిభక్తికమైన ఈ నవావరణకృతిలో దీక్షితులవారు–సంస్కృతంలోని ఎనిమిది విభక్తులు దేవి నామాలపరంగా వచ్చేరీతిలో రమణీయంగా కుదిర్చారు

ప్రథమావిభక్తి – శ్రీ కమలాంబా జయతి

ద్వితీయావిభక్తి – సూకరాననాద్యర్చితమహా త్రిపురసుందరీం రాజరాజేశ్వరీం చింతయేఽహమ్

తృతీయావిభక్తి – దివాకరశీతకిరణ పావకాది వికాసకరయా

ప్రాకట్యపరాపరయా, దయాకరయా పాలితో

| | |
|---|---|
| చతుర్థీవిభక్తి | - శ్రీమాత్రే |
| పంచమీవిభక్తి | - పరదేవతయాః సకలం జాతం |
| షష్ఠీవిభక్తి | - కాది హాది సాది మంత్ర రూపిణ్యాః |
| సప్తమీవిభక్తి | - శివగురు గుహ జనన్యాం ప్రీతియుక్త మచ్చిత్తం విలయతు |
| సంబోధనప్రథమ | - బ్రహ్మమయప్రకాశినిం నామరూపవిమర్శినిం కామకళాప్రదర్శిని సామరస్యదర్శిని |

శ్రీ దీక్షితులవారు విభక్తులకు ప్రాధాన్యంఇచ్చి ఎంధ దేవతలమీద వ్రాసిన వివిధ కీర్తనలున్నాయి విభక్తులు లేకుండ రచనలే సాగవు గాని, ఆయా విభక్తులనే ప్రయోగించి రచనలు కొనసాగించాలనే నిర్ణయం ముందే చేసుకొని రచనలు సాగించడంవల్ల విభక్తులకు ప్రాధాన్యం ఇచ్చినట్లు చెప్పడం జరిగింది శ్రీదీక్షితుల వారు ఈ విధంగా తిరుత్తణి కృతులు, (తిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్య స్వామివారి మీద) గురుగుహోజయతి మానసగురు గుహరూపం భజరేరే శ్రీ గురుణా పాలితోస్మి గురుగుహాయ గురుగుహాదన్యం నజానేఽహమ్ శ్రీ గురుగుహస్య దాసోఽహమ్ గురుగుహస్వామిని భక్తిం కరోమి శ్రీ గురుగుహమూర్తే (ఎనిమిది విభక్తులు) ఇదేవిధంగా మాయూరంలోని అభయాంబమీద తిరువారూరులోని శ్రీ త్యాగరాజస్వామి మీద ఎన్నో కృతులు చెప్పారు

భాషలోని విభక్తుల కింతటి ప్రాముఖ్యం ఇచ్చి వ్రాయడం తెలుగులో 'ఉదాహరణకావ్యం' అనే ప్రక్రియను జ్ఞాపకం తెస్తుంది అయితే అన్ని విభక్తుల లోను విడివిడిగా పద్యాలు (శ్లోకాలు) వ్రాయడంలోను, చిట్టచివరి ఏకపద్యం (శ్లోకం)సార్వవిభక్తికంగా వ్రాయడంలోను ముత్తుస్వామి దీక్షితుల వారి కృతులకు తెలుగు ఉదాహరణకావ్యానికి కొన్ని పోలికలున్నా తెలుగు ఉదాహరణ కావ్యానికి దీనికి ఇంతకంటె ఎక్కువ పోలికలున్నాయి అనలేము తెలుగు ఉదాహరణ కావ్యం మార్గదేశి కవితారీతుల సమ్మేళనం తెలుగు ఉదాహరణకావ్యంలో ఎనిమిది విభక్తులలో ఎనిమిదివృత్తాలు, ఎనిమిదికళికలు, ఎనిమిది ఉత్కళికలు

ఉంటాయి చివర సార్వవిభక్తిక వృత్తం ఉంటుంది అంటే- ప్రతి విభక్తికి ఒక వృత్తం ఒక కళిక ఒక ఉత్కళిక ఉంటాయి అన్నమాట చివర సార్వవిభక్తిక వృత్తం ఉంటుంది వృత్తాలలో సాధారణంగా- చంపకోత్పలమాలలు మత్తేభ శార్దూలాలు కనబడుతున్నాయి కళిక మాత్రాచ్ఛందస్సునకు సంబంధించినరగడ భేదం అయిఉండి ఎనిమిది పాదాలలో ఉంటుంది ఉత్కళిక అర్ధ కళిక పాదాలు మాత్రం ఎనిమిది ఉంటాయి సాధారణంగా ఉదాహరణ కావ్యం భక్తిపరంగా, స్తుతిపరంగా ఉంటుంది తెలుగులో మొట్టమొదట ఉదాహరణకావ్యం వ్రాసిన కవి పాల్కురికి సోమనాథుడు అది బసవోదాహరణం ఈ కవే సంస్కృతంలో కూడా బసవోదాహరణం వ్రాశాడు రెండింటిపేర్లు ఒకటే అయినా అవి వేరు వేరుగా వ్రాసినవేగాని ఒకదానికి రెండోది అనువాదం కాదు సంస్కృతంలో విద్యానాథుడు వ్రాసిన ప్రతాపరుద్రయశోభూషణమ్ అనే అలంకారశాస్త్రంలో దీని లక్షణం కనబడుతుంది ఈ లక్షణం సంస్కృతంలో ఉన్న బసవోదాహరణాన్ని చూచి వ్రాసినట్లు కనబడుతోంది పాల్కురికి సోమనాథుడు విద్యానాథుడు ఇంచుమించుగా ఒకే ప్రాంతానికి చెందినవారనవచ్చును సంస్కృతంలో ఉదాహరణ కావ్యాలు చాలాతక్కువ ఉన్నవాటిలో బసవోదాహరణమే ప్రథమం అంటున్నారు

కాలంలో కొంచెం పూర్వుడైన పాల్కురికి సోమనాథుని బసవోదాహరణము చూచి దాని ననుసరించి తల్లక్షణాన్ని విశ్వనాథుడు చెప్పినాడనవచ్చును విద్యానాథుని కంటె పూర్వుడైన సంస్కృతాలంకారికులెవ్వరు 'ఉదాహరణ' లక్షణం చెప్పినట్లు లేదు విద్యానాథుని లక్షణమిది

యేనకేనాపి తాళేన గద్యపద్యసమన్వితమ్
జయత్యుపక్రమమ్ మాలిన్యాది ప్రాసవిచిత్రితమ్
తదుదాహరణం నామ విభక్త్యష్టక సంయుతమ్॥

సంస్కృత బసవపురాణంలో జయతు బసవరాజః అని ఉంది మాలినీ వృత్తం మొదట ఉంది కళికోత్కళికలందు ప్రాస ఉంది అంచేత సంస్కృతంలో ప్రాసనియమం లేదు సంస్కృత గద్యలను పోలిన రగడ చందస్సు బసవోదాహరణ మున ఉన్నది ఇవిగాక శ్లోకాలున్నాయి కనుకనే విద్యానాథుడు గద్యపద్యసమన్వితమ్ అన్నాడు విభక్త్యష్టక సంయుతమ్ అనేది 'ఉదాహరణ'కు పూర్తిగా అన్వయించేదే!

ఇది ఇలా ఉండగా కాళిదాసు వ్రాసిన రఘువంశంలో జయోదాహరణం బాహ్వోర్గాపయామాసకిన్నరాన్ అని ఉంది ఇది రఘుమహారాజు విజయాలకు సంబంధించినది దీని వ్యాఖ్యానంలో మల్లినాథసూరి బాహ్వోః స్వభుజయోః జయోదాహరణం- జయాఖ్యాపక క్షుద్రప్రబంధ విశేషం అని వ్రాశాడు ఉదాహరణ' అనే కావ్య విశేషం ఉందని తెలియనివానికి తన బాహువుల జయోదాహరణాన్ని పాడించాడు అన్నప్పుడు ఉదాహరణ క్షుద్ర ప్రబంధం అని తెలియకపోతే అర్థంకాదు దేన్ని పాడించాడు? ఉదాహరణ అనే క్షుద్ర ప్రబంధాన్ని అని చెప్పినప్పుడు ఉదాహరణ అనే ప్రబంధ విశేషం ఉన్నదని తెలిసినవానికి అర్థం స్పష్టమవుతుంది! విభక్తులకు విశేష ప్రాముఖ్యమిచ్చి వ్రాసినది- అల్ప(క్షుద్ర) ప్రబంధమే మల్లినాథసూరి తెలుగువాడు గనుక వాల్కూరికి సోమనాథుని ఉదాహరణ కావ్యాన్ని గురించి, విద్యానాథుని నిర్వచనాన్ని గురించి విని ఉండడంలో ఆశ్చర్యంలేదు ఇందువల్లనే క్షుద్ర ప్రబంధవిశేషం అని వ్రాశాడని నా భావం! ఈ విషయం ఆంధ్రేతరులకు తెలియకపోవచ్చును

ఇదే విధంగా కాళిదాసుని విక్రమోర్వశీయమ్ లో- తుల్యానురాగపిశునం లలితార్థబంధం పత్రే నివేశితముదాహరణం ప్రియాయాః - అని కనబడుతోంది దీనికి వ్యాఖ్యానం వ్రాసినవారొకరు- ఉదాహరణ అనే కావ్య విశేషం ఉందని తెలియకపోలు- ఉదాహరణకు వృత్తాంతమ్- అని వివరణ వ్రాశారు భూర్జ పత్రం మీద ప్రియురాలి ఉదాహరణ కావ్యం లిఖితమైనదంటే అర్థవంతమే గదా! ఇదీ అల్ప (క్షుద్ర) కావ్యమే క్షుద్ర శబ్దానికి మనలో కొందరనుకొనే అర్థం లేదు ఇక్కడ! అయితే మహాకవి కాళిదాసే ఉదాహరణ శబ్దాన్ని కావ్యం అనే అర్థం చెప్పడానికి వీలుగా ప్రయోగించాడంటే- లక్షణగ్రంథాలు అప్పటికివచ్చినా రాకపోయినా విభక్తులకు ప్రాధాన్యంఇచ్చి వ్రాసే సంప్రదాయం ఒకటిఉందని ఒప్పుకోవాలి ఆళ్వారులపాశురాలలో ఉదాహరణలు లభిస్తున్నాయి 8వ శతాబ్దికి చెందిన శ్రీ కులశేఖరాళ్వారులు తమ ముకుందమాల లో(సంస్కృత రచన) కృష్ణోరక్షతు (శ్లోకం-33) అనే శ్లోకంలో సర్వవిభక్తులు వచ్చేటట్లు రచించారు (అవతారతత్త్వ వివేచన-పుటలు 272 273)

బసవోదాహరణ' కాలం నుండి నేటివరకు తెలుగులో ఎన్నో ఉదాహరణ కావ్యాలు బయలుదేరాయి గనుకనే పరిశోధన పరమేశ్వరులు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు (1903-1982)తెలుగులో ఉదాహరణవాఙ్మయచరిత్ర (1950)

వ్రాశారు ఆధునిక కాలంలో రాజకీయనాయకుల పేర్లమీద కూడా ఉదాహరణ కావ్యాలు వచ్చాయి స్వయంగా ఉదాహరణకావ్య రచన చేసిన కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు నిడుదవోలువారి ఉదాహరణ వాఙ్మయ చరిత్ర చదివి ఆయన్ని అభినందిస్తూ వ్రాసిన లేఖలో (7 2-1951) ఉదాహరణ కావ్య రహస్యాన్ని తాత్త్వికంగా మనోహరంగా వివరించారు జగత్తంతయు క్రియారూపము సర్వక్రియము పరమేశ్వరునందు పర్యవసించును ధాతువు సర్వథా విభక్త్యాశ్రయము ఏవిభక్తితో సంబంధము లేక క్రియలేదు అందుచేత అన్ని విభక్తులతో పరమేశ్వరుని చెప్పినప్పుడు భగవంతుడు సర్వక్రియాస్థానభూతుడని వ్యంగ్యము ఇది ఉదాహరణ కావ్యరహస్యము తాదృక్కావ్య చరిత్ర వ్రాసి మీ పరిశ్రమ భగవత్సేవయందు పర్యవసించుచున్నది మీరు పరిశోధనా పరమేశ్వరులు

మహాకవి ప్రేమాభిమానాలతో నిడుదవోలు వారికిచ్చిన పరిశోధనా పరమేశ్వర అనే బిరుదు సర్వజనామోదాన్ని పొంది ఆయనకు బిరుదుగా స్థిరపడింది! వీరి కృషి ఫలితంగానే- ఉదాహరణకావ్య ప్రక్రియకు సంగీత సాహిత్యాలతో ఉన్న సంబంధం, సప్త విధవిభక్తి పరిణామ వికాసాలు ప్రబంధాలలోని ఆశ్వాసాంత పద్యాలలోని విభక్తి రచనా విశేషాలు షష్ఠ్యంతాల విభక్తి వివేకం మొదలైనవన్నీ వెలుగులోనికి వచ్చాయి

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు అన్ని విభక్తులతో పరమేశ్వరుని చెప్పినప్పుడు భగవంతుడు సర్వక్రియా స్థానభూతుడని వ్యంగ్యము" అన్నారు ఈ మహాకవి తెలియజెప్పిన దాన్ని చాలాముందే పరిపూర్ణంగా గ్రహించిన వాగ్గేయకార సార్వభౌముడు శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు ఈ ప్రక్రియను పరమేశ్వరీ పరమేశ్వరుల విషయంలో ప్రయోగించి కృతకృత్యులయ్యారు వారు తెలుగులో కూడా చక్కని విద్వాంసులు భాషాసౌందర్యాన్ని ఎరిగినవారు తమ కృతులలో అభయాంబపై వ్రాసిన సర్వవిభక్తి కృతుల మంగళహారతిగా పాడవలసిన ముగింపుకృతి మణిప్రవాళశైలిలోఉంది అనగా దీనిలో-సంస్కృతం, తమిళం తెలుగు చరణాలున్నాయి ఈ శ్రీరాగకృతికి శ్రీ అభయాంబనిన్ను అని తెలుగులో పల్లవి ఉంది ఇదిగాక ఆయన వ్రాసిన ఇంకో తెలుగు పల్లవిఉన్న కృతి శ్రీ వేంకటాచలపతే నిన్ను నమ్మితి అనేది ఇది కాఫీ రాగంలోఉంది

ఈ మణి ప్రవాళ కృతులలో - తమిళం సంస్కృతం, తెలుగు కూడా ఉన్నా పల్లవి మాత్రం తెలుగులో ఉండడాన్ని బట్టి చూస్తే సహజమాధుర్యమున్న తెలుగుభాష పల్లవి రచనకు చాలా అనుకూలమైనదని శ్రీ దీక్షితులవారు భావించి నట్లు తోస్తుంది రాగ ప్రస్తారానికి పల్లవికి ఉన్న అవినాభావ సంబంధాన్ని గుర్తించి నందువల్లనే శ్రీ దీక్షితులు పల్లవిని తెలుగులో రచించారు ఇదిగాక వీరి శిష్యురాలైన దేవదాసి కమలం భరతనాట్యం ప్రథమ ప్రదర్శనం చేసేటప్పుడు తెలుగులో కొత్తపాటలు కావాలని అభ్యర్థించినప్పుడు తిరువారూరులో వేంచేసియున్న శ్రీ త్యాగరాజస్వామిమీద తోడిరాగంతో రూపముజూచి అనే పదవర్ణం నీ సాటి దైవమెందు లేదని శ్రీ రంజని రాగంలో దరువును వ్రాసి ఇచ్చారు

తెలుగుతో శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారికి సన్నిహిత సంబంధం ఉంది తెలుగులోనే ఇంచుమించుగా తమ అన్ని కృతులను రచించిన శ్రీ శ్యామాశాస్త్రి (1763-1827) శ్రీ దీక్షితులవారికి సన్నిహితమిత్రులు రామభక్తిని కలిగించి శ్రీ దీక్షితులవారి చేత తాము వ్రాసిన రామాష్టపదికి రాగ తాళాదులను నిర్ణయింపచేయించకొన్న శ్రీ ఉపనిషద్బ్రహ్మేంద్ర స్వామి తెలుగువారు ఆయన దగ్గిర వేదాంత విషయాలను తెలుసుకోవడానికి కొన్నిసంవత్సరాలు శ్రీ దీక్షితులు కంచిలో ఉన్నారు ఆనాటి కర్ణాటక సంగీతవాతావరణ మంతా తెలుగు మయం సంగీత త్రిమూర్తులలో ఒకరైన శ్రీ త్యాగరాజస్వామిని (1767 1847) దీక్షితుల వారు కలిసినట్లు తెలుస్తోంది తెలుగుతో ఇంత సంబంధం ఉన్న శ్రీ దీక్షితుల వారు ఉదాహరణకావ్య పద్ధతిని కొంత అనుసరించి సర్వవిభక్తికృతులు వ్రాయడంలో ఆశ్చర్యం లేదు

తమ సోదరులైన శ్రీ బాలస్వామి దీక్షితులు ఎట్టాయపురం రాజు ఆదరణ పొంది అక్కడే స్థిరపడడం చేత శ్రీ దీక్షితులవారు కూడా అక్కడే తమ జీవిత చరమ దశను గడిపారు

1835వ సంవత్సరంలో ఆశ్వయుజ బహుళ చతుర్దశి (నరక చతుర్దశి) నాడు ఎట్టాయపురం రాజుగారి భద్రగజం మదించికట్లు త్రెంపుకొని పారిపోయి శ్మశానం చేరి అక్కడ ఘీంకరిస్తూ ఉంటే అది అశుభంగా భావించిన రాజు ఆ సంగతి శ్రీ దీక్షితులవారికి మనవిచేసుకొనగా రాజునకు ఏ అశుభం జరగదని మాట ఇచ్చి శ్రీ దీక్షితులవారు ఆ దినం తమ స్వర్గారోహణ దినంగా గ్రహించారు

శ్రీ అన్నపూర్ణాదేవి తేజోరూపంలో దర్శనం ఇస్తే పున్నాగవరాళి రాగంలో (ఆదితాళం)

'ఏహి అన్నపూర్ణే సన్నిధేహి సదాపూర్ణే సువర్ణే క్షాం హ్రాం పంచా
శదవర్ణే యాం హ్రాం పంచాశద్వర్ణే శ్రియం దేహిరక్తవర్ణే అపర్ణే॥

అని కీర్తించారు తరువాత శిష్యుల నందరిని పిలిచి గమకక్రియరాగంలోని మీనాక్షి మేముదం దేహి అనే కృతిని గానం చేయవలసినదని చెప్పి అనుపల్లవి లోని మీనలోచని! పాశమోచని! అనే మాటలు రాగానే కళ్ళు మూసుకొని పాహి శివే శివే పాహి అంటూ బ్రహ్మరంధ్రం ఛేదించుకొని ముక్తిని పొందారు

శ్రీ బాలస్వామి దీక్షితుల దౌహిత్రుడు దత్తపుత్రుడు అయి శ్రీ సుబ్బరామ దీక్షితులు (1839–1906) అనంతరకాలంలో ప్రసిద్ధవాగ్గేయ కారుడయ్యాడు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు స్మార్త సంప్రదాయానికి చెందిన అద్వైతి గనుక నిస్సంశయంగా సర్వదేవతారూపాలను– శైవ వైష్ణవ భేదం లేకుండా– అర్చించి ధన్యులయ్యారు పంచాయతన పూజ ఉన్న సంప్రదాయానికి చెందినవారు గనుక ఆదిత్యుని అంబికను విష్ణువును గణనాథుని మహేశ్వరుని– సమానంగానే దర్శించారు అర్చించారు కృతులుగానం చేశారు కంచి వరదరాజస్వామిమీద ఏకామ్రేశ్వరునిమీద శ్రీ వేంకటేశ్వరస్వామిమీద శ్రీ కాళహస్తీశ్వరుని మీద, శ్రీ రంగనాథునిమీద శ్రీ చిదంబరనటరాజుమీద, శ్రీరంగనాయికమీద, శ్రీశివకామేశ్వరిమీద తిరుత్తణి సుబ్రహ్మణ్యస్వామిమీద వాతాపిగణపతిమీద శ్రీరామచంద్రునిమీద, శ్రీకృష్ణునిమీద హరిహరపుత్రుడని పేరుపొందిన అయ్యప్పమీద అందరి మీద సమానమైన భక్తిశ్రద్ధలతో కృతులు రచించి గానం చేశారు వ్రతానాం ఉత్తమ వ్రతమ్ అన్న సంప్రదాయంలో ఏదేవీ దేవతల నుద్దేశించి గానం చేస్తూ ఉంటే ఆ దేవీదేవతలే సర్వోత్కృష్టులని పరబ్రహ్మ స్వరూపులని విశ్వసించి గానం చేశారు అన్ని అర్చామూర్తుల వెనుక పరతత్వం ఒక్కటే అనే విశ్వాసం ఆ పరతత్వాన్ని మన సౌలభ్యం కోసం మన ఇష్టాన్ని అనుసరించి ఏ పేరుతో పిలిచినా పలికేది ఒకరే అనే విశ్వాసం– పునాదులైన స్మార్త సంప్రదాయానికి చెందిన అద్వైతి గనుకనే శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారు– ఆళ్వారులవలె గాక, నాయన్మారులవలె గాక– అన్ని అర్చామూర్తులున్న దేవాల

యాలను దర్శించి విష్ణు శివ, శాక్త భేదం లేకుండ అందరిని గూర్చి భక్తితో గానం చేశారు అయినా గురుగుహ ముద్రతో తమ కృతులను గానం చేయడం వల్ల ఆయన ఇష్టదైవం తిరుత్తణి సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అని చెప్పవచ్చును ఈ విధంగా ఇష్టదైవం ఉండటం స్మార్త సంప్రదాయానికి విరుద్ధం కాదు పర బ్రహ్మ స్వరూపిణి అయిన జగన్మాతమీద నవావరణకృతులు గానం చేయడం పరబ్రహ్మ ఆజ్ఞానుసారం మన కర్మఫలాన్ని మంచేత అనుభవింపజేసే నవ గ్రహాలమీద కృతులు గానం చేయడం- ఆ ఉదాత్తసంప్రదాయంలోని భాగాలే ఆయా కృతులను భక్తి శ్రద్ధలతో మనం గానం చేసుకొంటే ప్రత్యవాయాలు తొలగి సుఖశాంతులు లభించడం ఆ సంప్రదాయం లోని ఫలితాలే! శైవులులేరు వైష్ణవులులేరు అందరూ శాక్తులే! అందరూ వేదమాత అయిన గాయత్రిని అర్చి స్తారు గనుక- అన్నది జ్ఞాపకం వస్తుంది- దీక్షితులవారి నవారణ కీర్తనలను పరిశీలిస్తే

"సర్వే శాక్తా ద్విజాః ప్రోక్తా, నశైవా న చవైష్ణవాః ।
ఆదిదేవీముపాసంతే, గాయత్రీం వేదమాతరమ్॥

జగన్మాత సర్వవర్ణ స్వరూపిణి, సంధ్యావందనంలో సర్వవర్ణే మహాదేవి సంధ్యా విద్యే సరస్వతి అని ఉంది న గాయత్ర్యాః పరం మంత్రమ్ అన్నారు పెద్దలు ఇవన్నీ తెలిసినవారు గనుకనే శ్రీ దీక్షితులవారు తమ నవావరణ కీర్తన లను మంత్రపూతాలుగా రచించి- గాయకులకు శ్రోతలకు కూడా అవి సర్వారిష్ట నివారణ సర్వాభీష్ట ప్రదాన సమర్థాలు అని సూచించారు

శ్రీ దీక్షితులవారు శ్రీ చక్రార్చనా దురంధరులు గనుక ఆ ప్రక్రియ ననుస రించి నవావరణ కీర్తనలు గానం చేశారు శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలోని శృంగారరససంపూర్ణా అనే నామం చక్రంలోని నవావరణలలో నవరసాకృతితో జగన్మాత ఏ విధంగా భాసిస్తోందని భావింపబడుతోందో సూచిస్తుంది

త్రైలోక్య మోహనచక్రావరణంలో- శృంగారరసాత్మికగా, సర్వాశాపరి పూరక చక్రావరణంలో- వీరరసాత్మికగా సర్వసంక్షోభణ చక్రావరణంలో- కరుణరసాత్మికగా సర్వసౌభాగ్య చక్రావరణంలో- భయానక రసాత్మికగా, సర్వార్థసాధక చక్రావరణంలో బీభత్స రసాత్మికగా, సర్వ రక్షాకర చక్రావ

రణంలో రౌద్రరసాత్మకగా సర్వరోగహర చక్రావరణంలో-హాస్యరసాత్మకగా సర్వసిద్ధిప్రద చక్రావరణంలో అద్భుతరసాత్మకగా సర్వానందమయచక్రావరణంలో శాంతరసాత్మకగా-పరమేశ్వరి భాసిస్తూ ఉండడంవల్ల ఆమె శృంగార రససంపూర్ణ అయినది ఇక్కడ ప్రధాన రసమై శృంగారం నవరసాలకు ఉపలక్షణంగా గ్రహించబడింది వాగ్గేయకారులు కమలాంబికను గూర్చి గానం చేశారు దశమహావిద్యలలోని కమలాత్మిక యే కమలాంబిక దశమహావిద్యలు ఇవి

'కాళీతారా మహావిద్యా షోడశీ భువనేశ్వరీ
భైరవీచ్ఛిన్నమస్తాచ విద్యాధూమావతీ తథా ।
బగళా సిద్ధవిద్యాచ మాతంగీ కమలాత్మికా
ఏతాదశమహావిద్యాః సిద్ధవిద్యాః ప్రకీర్తితాః ॥"

ఈ సిద్ధవిద్యలన్నీ బ్రహ్మ విద్యాలే అన్నింటికి మంత్రాలు ఆచరణ విధానాలు వేరువేరుగా ఉంటాయి

శ్రీ విద్యారణ్యులు శ్రీ కాళీస్తోత్రమ్‌లో వీటి నన్నింటిని ఈ విధంగానే పేర్కొన్నారు

త్వం కాళీ త్వంచతారా త్వమసి గిరిసుతా సుందరీ భైరవీత్వం
త్వందుర్గాచ్ఛిన్నమస్తాత్వమసిచ భువనాత్వం హి లక్ష్మీశ్శివాత్వమ్ ।
ధూమామాతంగినీ త్వం త్వమసిచ బగళామంగళా దిస్తవాఖ్యా
క్షంతవ్యోమేఽపరాధః ప్రకటిత వదనే కామరూపే కరాళే ॥"

మహోపాసకులు ఆధునిక యుగంలో ఆర్షకవులు అయిన కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతి మునులు (1878 1936) తమ 'మహావిద్యాది సూత్రావళి అనే గ్రంథం ప్రథమభాగంలో దశమహావిద్య లను వివరించారు అవి కాళీ, తారా సుందరీ, భువనేశ్వరీ భైరవీ, ప్రచండ చండికా ధూమావతీ బగళాముఖీ మాతంగీ, కమలాత్మికా పటలాలు ఈ విద్యలను గూర్చి సూత్రాలు లఘువివరణాలు ఇందులో ఉన్నాయి శ్రీ విద్యారణ్యుల స్తోత్రంలో ఉన్న సుందరియే త్రిపురసుందరి భైరవియే త్రిపురభైరవి ఛిన్నమస్తయే ప్రచండచండిక భువ

నేశ్వరియే మహామాయ, ధూమావతియే యోగనిద్ర కమలాత్మికయే లక్ష్మి— అని గ్రహించాలి

ఈ దేవీదేవతల నామాలను అప్పుడప్పుడు స్వేచ్ఛగా ప్రవేశంగా ప్రకరణాన్ని అనుసరించ అపార్థస్ఫూర్తి కలుగుతుందనే సంకోచం కలిగి ఎ డు తప్ప— పర్యాయపదాలుగా ప్రయోగించడం కనబడుతుంది శ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ అనే రెండు పాఠాలతోని— హ్రీ, శ్రీశబ్దాలు మహాత్రిపుర సుందరికి శ్రీదేవికి సమా ంగానే అన్వయిస్తాయి ఇద్దరూ ఒక్క రే! చిచ్ఛక్తి స్వరూపశ్రీదేవియే శ్రీ సూక్తమంత్రాలలో వర్ణిత అయిన దేవి శ్రుతిలో 'అగ్ని స్తుష్టో యజమానాయ శ్రియం ప్రయచ్ఛతి (అగ్ని సంతుష్టుడై యజ మానికి శ్రీ నిస్తున్నాడు) ఈ అగ్నిఎవరు? 'అగ్ని ర్నారాయణో భగవాన్' అని ఉంది గనుక ఈ అగ్ని లక్ష్మీదేవి భర్త అయిన శ్రీమన్నారాయణుడు అని కొందరు, రుద్రోవావిష అగ్నిః అని శ్రుతి చెప్పింది గనుక ఈ అగ్ని— మహా త్రిపురసుందరీ, ఉమాపార్వతీ మొదలైన నామాలున్న శ్రీదేవి భర్త అయిన రుద్రుడని కొందరు వాదించుకోవడం ఉంది పారమార్థికంగా రుద్రనారాయణు లొక్క రే అనుకొనే అస్మదాదులకు ఈ శంక కలుగదు శివశక్తి అయిన ఉమను లక్ష్మిగా సంబోధించడంలో మహాపరాధం ఏమీలేదని ప్రాచీనుల రచనలే స క్ష్యం ఇస్తున్నాయి ప్రత్యేకంగా ప్రకరణాన్ని అనుసరించి అపార్థస్ఫూర్తి కలుగుతం దనే సంకోచం కలిగినప్పుడు తప్ప - అని పూర్వమే వ్రాశాను దేవీపురాణంలో 'లలితా శారదా, లక్ష్మీ రేకైవ భగవత్యుమాతత్తల్లక్షణ సంయుక్తా పురుషార్థ ప్రదాన్నృణాం అని ఉంది! కనుక కమలాత్మికయే కమలాంబిక

దేవీ స్తోత్రాదులలో అనేక నామాలు ఉద్దిష్టమైన దేవికి పర్యాయపదాలుగా వాడడం ఉన్నా వేరే ఉపాసనాధికానికి వచ్చేటప్పటికి ఆయా దేవులకు వేరువేరు బీజాక్షర సంపుటులు ఉన్నాయి అని గుర్తించాలి ఉదాహరణకు సౌందర్యలహ రిలో శ్రీ శంకర భగవత్పాదుల

"గిరామాహుర్దేవీంద్రుహిణ గృహిణీ మాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయాం
తురీయాకాఽపిత్వం దురధిగమ నిస్సీమమహిమా
మహామాయావిశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి" (శ్లోకం 98)

ఇదే విధంగా కనకధారాస్తోత్రం లో ఇలా ఉంది

గీర్దేవదేతి గరుడధ్వజ సుందరీతి
శాకంభరీతి శశిశేఖర వల్లభేతి
సృష్టిస్థితి ప్రళయకేళిషు సంస్థితాయా
తస్యైనమస్త్రిభువనైక గురోస్తరుణ్యై॥ (శ్లోకం 10)

అన్నీ ఆమెయే అని చెప్పినా అభీష్టాన్ని అనుసరించి వివిధ రూపకల్పనలు ఆమెకు చేసి వివిధ బీజాక్షరాల సంపుటితో మంత్రాలు భావించి ఆమెను సేవించి ఇష్టకామ్యాలను పొందుతున్నారు

'లక్ష్మీప్రదాన సమయే నవవిద్రుమాభామ్
విద్యాప్రదాన సమయే శరదిందు శుభ్రామ్।
విద్వేషవర్గవిజయేతు తమాల నీలామ్
దేవీంత్రిలోక జననీం శరణం ప్రపద్యే॥

అనే శ్లోకం పైదానికి తార్కాణంగా గ్రహించవచ్చును ఈ మూర్తుల కన్నింటికి విశిష్టమైన మంత్రాలు జపవిధానాలు, నైవేద్యాదికాలు ఉన్నాయి అనేవి సర్వజన విదితం

అవతారాలను దేవతలను ఆరాధించి శ్రీమద్రామాయణాది మంత్రపూతా లయిన గ్రంథాలలోని ప్రత్యేకాధ్యాయాలను పఠించి (ఇక్కడ సత్ఫలితాలు ఆయాఅధ్యాయాలలో వర్ణితాలయిన అవతారాలవల్ల దేవీదేవతలవల్లనే లభిస్తాయి అనవచ్చును ) వివిధ గ్రహాలు గోచారాది విషయాలలో దోషదుష్టాలయినప్పుడు వాటిని నివారించుకోవడం అనేది మనకు అనూచానంగా వస్తూ ఉన్న ఆచారమే సనాతనధర్మేతర ధర్మాల ననుసరించేవారుకూడా వారికష్టకాలాలలో ఆయా ధర్మా లకు విహితమై ఉన్న పవిత్ర గ్రంథాలనుండి భాగాలను భక్తితో పఠించడం మొదలైనవి లోకంలో మనకు కనబడుతూనే ఉన్నాయి

సనాతన ధర్మానుయాయులలో శాంతి ప్రక్రియలుగా- వైదిక, పౌరాణిక తాంత్రిక శాబరమంత్రాలు శతాబ్దులుగా వినియోగంలో ఉన్నాయి వైదికాలు వేదసంబంధ (శ్రుతి) మైనవి పౌరాణికాలు లౌకిక రచనలలోని (రామాయణ,

భారత భాగవతాది గ్రంథాలలోని స్తోత్రాదులుగాని ప్రత్యేకాధ్యాయాలుగాని) తాంత్రికాలు తంత్ర గ్రంథాలలోనివి శాబరమంత్రాలకు అపభ్రంశాలు అని కూడా పేరుంది ఇవి దేశభాషలలోని మాటలతో నిండిఉంటాయి ఉదాహరణంగా క్రింది మంత్రాన్ని గ్రహించవచ్చును పుచ్చు పంటికి మంత్రం ఓం నమో భగవతే ఊరి వెలుపల పడమర దిశను పూడల ఎర్రి క్రింద పెద్దపుట్ట కడుపున పాము బుట్టె పాము కడుపున ఈగ బుట్టె, ఈగ కడుపున యీఎ పుట్టె, పుచ్చి మానవలె పురుగులు చావవలె ఓం పరబ్రహ్మ మా గుర్వాజ్ఞ ఓం హ్రీం ఫట్ స్వాహా 6 సార్లు పఠించి మంత్రించవలయును పురుగులు పోయి పల్లు శుభ్రమగును పిశాచాలు తొలగిపోవు మంత్రం ఓం శరవణ భవ సర్వపిశాచాది గ్రహములు నన్నుచూచి భయమొంది పారజూడు ఐం క్లీం సౌం స్వాహా ఇవన్నీ శక్తి మంత్రాలే సంశయం లేదు కాని నియమ నిష్ఠాదికంలో ఆచార వ్యవహారాదుల పరిపాలనలో భేదాలున్నాయి శాంతిప్రక్రియలు అనంతంగా ఉన్నాయి ఇంక మంత్రాల సంగతి చెప్పనక్కరలేదు సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః అన్నారు పెద్దలు కనుక గురూపదిష్టమైన మంత్రాన్ని ఆయన చెప్పిన విధాంగా జపించడం శ్రేయస్కరం యజ్ఞానాం జపయజ్ఞోస్మి అన్నాడు శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో- శాస్త్రకారులో యజ్ఞదానాదులు జపయజ్ఞంలో 16వ వంతునకు సరి రావు అన్నారు (యావంతః కర్మయజ్ఞాశ్చ, దానాని చ తపాంసిచ । తేసర్వేజపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం॥ ) ప్రతి మంత్రానికి అంగన్యాసకరన్యాసాదులున్నాయి సద్గురువు అనుగ్రహం పొందిన తరువాత సిద్ధారి చక్రరీత్యా ఉపదేశం పొందబోయే మంత్రం తనకు అచ్చుబాటు అగునో కాదో చూసుకొని శుభదినమందు ఉపదేశాన్ని పొంది కూర్మచక్రరీత్యా దీప స్థానాన్ని గుర్తించి కల్పోక్త విధానంగా నిర్ణీతమైన స్థలంలో శాస్త్రోక్తమైన ఆసనంమీద కూర్చుండి నియమితసంఖ్యలో, నియమిత దినాలు- ఆ మంత్ర మూర్తి యంత్రంముందో, ప్రతిమముందో ఆ మంత్రమూర్తిని ఆహ్వానించిన జలపూరిత కలశంముందో-మంత్రజపం చేయడంద్వారా మంత్రసిద్ధిని పొందడం ముఖ్యవిధానం మంత్రాధిష్ఠానమైన దేవతానుగ్రహం పొంది తాను తరించి ఇతరులను తరింపజేయడం మంత్రశాస్త్ర గమ్యమని స్థూలంగా చెప్పవచ్చును

ఈ మంత్రాలలో వైదిక మంత్రాలకు స్వరం, వర్ణం ప్రధానాలు దుష్ట శబ్దాన్ని గాని అపస్వరం గాని ఉచ్చరిస్తే ప్రత్యవాయం ఉందని పెద్దలు నిర్ణ

యించారు గనుక ఆ మంత్రాలను వినియోగించుకొనే సందర్భంలో వేదాధ్య యనం చేసినవారి సాహాయ్యాన్ని పొందడం అత్యంతావశ్యకం ఈ స్వరం అనేది మనంతటమనం పుస్తకాలు చూచి నేర్చుకో గలిగినదికాదు స్వరప్రధాన మైన వైదికమంత్రాలను సరిగా ఉచ్చరించకపోతే ఉపకారానికి బదులు అపకారం జరుగుతుందని పాణినీయ శిక్షలో ఇలా ఉంది మంత్రోహీనః (దుష్టశ్శబ్దః) స్వరతో వర్ణతో వా మిథ్యా ప్రయుక్తోన తమర్థమాహ । సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్ ॥ వేదమంత్రం స్వరంవల్ల గాని వర్ణంవల్లగాని విహీనమైతే అర్థదోషంవచ్చి ఆ వాక్కు వజ్రమై యజమానిని హతం చేస్తుంది ఎలాగంటే ఇంద్రశత్రువు అనే శబ్దం స్వర ప్రమాదంవల్ల కలిగించినట్లు!

స్వరసంబంధమైన అపరాధంవల్ల వచ్చిన నష్టాన్ని తెలియజెప్పే ఒక కథకు ఇందులో సూచన ఉంది ఆ కథ ఇది విశ్వరూపుడనే తన కొడుకును ఇంద్రుడు చంపినాడనే కోపంతో త్వష్ట ఇంద్రుని చంపేవాడు ఆవిర్భవించాలి అనే దీక్షతో అభిచారహోమం ప్రారంభించాడు ఆ సందర్భంలో ఋత్విజుడు ఇంద్రశత్రుం వర్ధస్వ అనేదాన్ని ఆద్యుదాత్తంగా ఉచ్చరించడంవల్ల బహువ్రీహి సమాసం అర్థంవచ్చి–వృత్రాసురుడు ఆవిర్భవించి–అతడు ఎంత పరాక్రమవంతుడైనా ఇంద్రునిచేతిలో చనిపోయాడు అనిష్టార్థం వచ్చిందన్నమాట! దాన్ని అంతోదాత్తంగా ఉచ్చరించి ఉంటే అప్పుడు దానికి షష్ఠి తత్పురుష సమాసం అర్థంవచ్చి (ఇంద్రస్య శత్రుః) అభిప్రేతం సిద్ధించి ఉండేది ఇక్కడ శత్రుపదానికి శాతయిత (నాశకుడు) అని అర్థం స్వరంలో వచ్చిన ఈ పొరపాటువల్ల త్వష్టకు అభీష్ట సిద్ధికాలేదు పైగా అనిష్టం కూడా సంభవించింది

వేదమంత్రాలు–స్వరాదికానికి ఇంత ప్రాధాన్యం ఇస్తున్నవి గనుక–సామాన్యులు వాటిని విడిచి అంటే అనిష్టాగరిష్ఠులకన్నమాట-పౌరాణిక తాంత్రిక మంత్రాలను, శాబరమంత్రాలను (దేశభాషలలో నున్నవాటిని) ఆశ్రయిస్తే దోషం లేదు ఏ మంత్రమైనా జుగుప్సాకరమైన క్రియాకలాపాదులను నిర్దేశిస్తే–దానిని విసర్జించడం మంచిది చతుష్షష్టి తంత్రాలలో ఘోరమైన ఆచారాకాదికాన్ని విసర్జించి పశుపతి అఖిల పురుషార్థైక ఘటనా । స్వతంత్రం తే తంత్రం క్షితితల

ఖవాతీతరదిదమ్॥ అని సౌందర్యలహరిలో అన్న శ్రీ విద్యాతంత్రాన్ని దేవి కోరిక ననుసరించి అవతరింపజేసినట్లు తెలుస్తోంది దీనిలో కూడా వామాచారాన్ని పరిహరించి సమయాచారాన్ని (దక్షిణాచారాన్ని) ఆశ్రయించడం శ్రేయస్కరం

ఇంక సకలకార్యసిద్ధికి కష్టనివారణకు గ్రహపాటు ను సరిదిద్దుకోవడానికి శ్రీమద్రామాయణంలోని వివిధకాండలను వివిధాధ్యాయాలను వివిధ కార్యాలసిద్ధికి పారాయణం చేయడం ఆనూచానంగా ఉంది అన్ని సంప్రదాయాలవారు ద్వైత విశిష్టాద్వైత, అద్వైత సంప్రదాయాలవారు ఈ పారాయణం చేయడం ఉంది జ్యోతిశ్శాస్త్రరీత్యా అరిష్టదాయకదశాభుక్తులు జరుగుతుతూ ఉన్నప్పుడు విద్వాంసు డైన దైవజ్ఞుని హితోక్తి ననుసరించి వివిధకాండలలోని సర్గలను పారాయణం చేయడం యథోక్తరీతిని నైవేద్యంసమర్పించడం మొదలైనవి జరుగుతూఉన్నాయి సుందరకాండపారాయణవిషయం సర్వజన విదితం ఈ విషయాలన్నీ ఉమా సంహిత లో చెప్పబడిఉన్నాయి ఇదేవిధంగా యథోక్తరీతిని దుర్గాసప్తశతిని వివిధ చరిత్రలను స్తోత్రాలను కవచ కీలకార్గళల పారాయణాదికం ప్రచారంలో ఉన్నదే! శ్రీ మద్భాగవతంలోని వివిధస్కంధాలలోని వివిధాధ్యాయాల పారాయ ణాదికం కొనసాగుతూనే ఉంది శ్రీమద్భాగవతంలోని శ్రీ నారాయణకవచం (షష్ఠస్కంధం-8వ అధ్యాయం) మొదలైనవి ప్రసిద్ధాలే వీటి కన్నింటికి అంగ న్యాసకరన్యాసాదులు కూడా ఆచరణలో ఉన్నవే! కౌశిక సంహితలో శ్రీమద్భాగ వత వైభవం వర్ణితం ఇవన్నీ సంస్కృతంలోనే చదువుకోవాలనే నియమం ఏమీ లేదు పూర్వతరంలోని లేదా మాతరంలోని తెలుగువారు, ఎవరికేనా ముఖ్యంగా కన్యకకు (కూతురి వివాహం తమ ప్రత్యేక బాధ్యత అని తల్లిదండ్రులు అనుకొన్న కాలం) వివాహం ఆలస్యం అయితే పోతనభాగవతంలోని రుక్మిణీకల్యాణం అమ్మాయిచేత చదివించేవారు ఇదేవిధంగా కష్టాలువస్తే 'గజేంద్రమోక్షణం' చదువుకొనేవారు! వ్యక్తిగతమైన లాభానికేగాక, సమాజశ్రేయస్సుకోసం యజ్ఞ యాగాదులు చేయడం, అభిషేకాలు చేయడం మనలో ఉన్న విషయాలే! మహా భారతంలోని విరాటపర్వం చదవడం పురాణం చెప్పించడం ఒకప్పుడు సర్వ సామాన్యం

అన్ని భారతీయ భాషలలోను ఆయా భాషాభాషీయులు పవిత్రాలనీ, ఫల దాయకాలనీ భావించే ఉద్గ్రంథాలు ఉండనే ఉన్నాయి కష్టాలు వచ్చినప్పుడు

గాని, గ్రహాను కూల్యం లేనప్పుడు గాని ఆయా పవిత్ర గ్రంథాలలోని భాగాలను లేదా ఆయా మహానుభావులు వ్రాసినస్తోత్రాలను పారాయణచేయడం సర్వేసర్వత్ర దృగ్గోచరమవుతూనే ఉంది గోస్వామి తులసీదాసు వ్రాసిన శ్రీ హనుమాన్ చాలీసా మన దేశంలో ఎల్లలులేని స్తోత్రరాజం అయింది తెలుగు పల్లెటూళ్ళలో కూడా దేవాలయాలలో గోడలమీద ముఖ్యంగా హనుమదాలయాలలో- ఈ హనుమాన్ చాలీసా (40 చౌపాయీలు) స్తోత్రం తెలుగులిపిలో చెక్కి-ఉండడం ఈనాడు విరివిగా కనబడుతోంది ప్రతిపదానికి అర్థం తెలియకపోయినా రామాయణంలోని హనుమంతునకు సంబంధించిన విషయం గనుక, చదివిన వారందరు కొంత అర్థం చేసుకొంటున్నారు ఈ పఠనంవల్ల కష్టనష్టాలు తొలగిపోతాయి అనే విశ్వాసం ఉండడంవల్ల దీని ప్రచారానికి లోటు లేదు ఈ మధ్య కాలంలో దీన్ని ప్రచారంలోనికి తెచ్చిన ఘనత-మహాభక్తులు మహాగాయకులు అయిన శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వాములవారిది ఈ మహాపురుషుడు తమ కీర్తనల సభలలో మధుర కంఠంతో వివిధ భారతీయ భాషలలోని భక్తిగీతాలను గానం చేస్తూ వాటికి ప్రచారం తెచ్చారు భగవన్నామ సంకీర్తన అనే పేరుతో ఆయా సంకీర్తన స్తోత్రాలను తెనాలిసాధన గ్రంథమండలివారు పచురించి (సప్తమ ముద్రణం-1966) భక్తులకెంతో సేవచేశారు దీని పఠనం సుందరకాండ పఠనంతో తుల్యమనే విశ్వాసం ఉండడం వల్ల దీని ప్రచారం అధికమైంది ఈ స్వాములు 1978లో ఆకస్మికంగా హైదరాబాదులో సద్దిపొందారు తెలుగులో దీని ప్రచారాన్ని శ్రీ ఎమ్ ఎస్ రామారావుగారు తమ మధురగానంతో ఇనుమడింపజేశారు భకునకు భక్తి ప్రదర్శనకు భాషాభేదం అడ్డురాదని రుజువవుతోంది తెలుగు ప్రజలు కష్ట సమయాలలో చదివే వివిధ శతకాలతో బాటు హనుమాన్ చాలీసా కూడా స్థానం సంపాదించింది

ఇదే విధంగా శ్రీ దత్తాత్రేయులవారి అవతారంగా గ్రహింపబడిన శ్రీ షిర్డీ సాయిబాబా (సద్ది-1918)వారి స్తోత్రాదికం, ఆయన అవతారంగా ప్రపంచంలోని భక్తులందరు భావించి, ఆత్మార్పణం చేసుకొని సంకీర్తనాదికం ద్వారా, సేవాకార్యక్రమాల ద్వారా ఆయన అనుగ్రహాన్ని పొంది సంతృప్తిని కృతార్థతను సంపాదించుకొంటూఉన్న భగవాన్ శ్రీ సత్యసాయి బాబా (అవతరణ-1926) వారి భజనావళి అష్టోత్తర శత సహస్రనామస్తోత్రాదులు ఆధునిక యుగంలో సనాతన దేవతాదికంతో బాటు ఆయా స్తోత్రసాహిత్యంతోబాటు సర్వేసర్వత్ర

విద్యమానమవుతున్నాయి ఇంకా ఎందరో మహానుభావుల, మహానుభావులరాం ద్ర పూజాదికం చేస్తూ ప్రజలు ప్రశాంతిని పొందుతున్నారు ఈ భగవద్రూపకల్పన లోని వైవిధ్యానికి మూలసూత్రం— ఏకం సత్ విప్రాబహుధావదంతి అనే పరమ ధర్మం ప్రతిసనాతన ధర్మావలంబికీ— ఈధర్మసూక్ష్మం ప్రత్యక్షంగా తెలియక పోయినా ఈ జ్ఞానం అజ్ఞాతంగా అంతర్నిహితంగా ఉన్నదనడం పరమసత్యం

* * *

"అమంత్రం అక్షరం నాస్తి
అక్షరాణామకారోఽస్మి" (భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు)

అనాదినిధనం బ్రహ్మశబ్దతత్త్వమ్ యదక్షరమ్ ।
వివర్తతేఽర్థభావేన ప్రక్రియాజగతో యతః ॥
(వాక్యపదీయంలో శ్రీ భర్తృహరి)

చైతన్యం సర్వభూతానాం శబ్దబ్రహ్మేతి మేమతిః ।
తత్ప్రాప్య కుండలీరూపం ప్రాణినాం దేహమధ్యగాం
వర్ణాత్మనావిర్భవతి గద్యపద్యాది భేదతః ॥
(శారదాతిల మ్)

# Select Bibliography

Advaitakshara Malika — Advaita Sabha of Kumbhaghonam (A Collection of Essays) 1946

Alwars of South India—K C Varadachari (Bharatiya Vidyabhavan Bombay 1966)

An Indian Monk— Purohit Swami (Macmillan 1932)

Appayya Dikshita— N Ramesan IAS (Hyderabad Srimad Appayya Dikshitendra Granthavali Prakasana Samithi 1972)

Aspects of Advaita— Srinivasachari Madras 1949
Avadhuta Gita— Purohit Swami
Bengal Vaishnavism— Bepin Chandrapal Calcutta 1933

Bhagavadgita (With Sankara's Commentary)
Editor Mahadeva Sastry Madras 1947

Bhagavadgita— S Radhakrishnan
(With Notes etc George Allen & Unwin Ltd
London 1948)

Bhakti Cult in Ancient India— Bhagavata Kumara Sastri
Calcutta 1922

Bhakti Sastra—(Translation of the Sutras of Narada
Sandilya and Bhakti Ratnavali of Vishnupuri into
English) — Nandalal Sinha Allahabad

Bhakti Schools of Vedanta—Swami Tapasyananda
Sri Ramakrishna Math Madras-1990

Brahma Samhita—Arthur Avalon Calcutta (Edition)

Chaitanya Movement—M T Kennedy
(Oxford University Press, 1925)

Chaitanya's Life and Teachings— Jadunath Sircar
Calcutta 1922

Comparative Studies in Vedantism —Mahendranath Sircar Bombay 1927

Comparison of the Bhashyas of Sankara Ramanuja Kesava Kasmirin and Vallabha on some critical sutras
—R D Karmarkar 1920

Comparative study of the Commentaries of the three great Acharyas— Sankara Ramanuja and Madhwa
—Dr B N K Sarma

Cultural Heritage of India (volumes) Ramakrishna Mission Institute

Dattatreya—Glory of the Divine in man Shirdi Baba Vidyanagar Editor— E Bharadwaja 1981

Dattatreya— Jaya Chamarajendra Wadiyar Bahadur George Allen & Unwin 1957

Devi Mahatmya— (Editor) Vasudeva S Agrawala Varanasi 1963

Doctrines of Nimbarka and his followers with English trans lation of Vedanta Parijata Saurabha of Nimbarka and Vedanta Kaustabha of Srinivasa
—Roma Bose (Royal Asiatic Society of Bengal Calcutta 1943 )

Dvaita Philosophy and its place in the Vedanta–Vidwan H N Raghavendrachar (Studies in Philosophy Mysore University, 1941)

Early History of the Vaishnava Faith and Movement in Bengal— S K De Calcutta 1961

Early History of Vaishnavism in South India
—S Krishnaswamy Aiyangar (Oxford University Press) 1920

Eastern Religions and Western Thought — S Radhakrishnan, London 1950

Erotic Principle and Unalloyed Devotion—
N K Sanyal Gaudiya Mission, Calcutta

Essays on the Gita— Sri Aurobindo Arya Publishing House Calcutta

Fundamentals of Visishtadvaita — S M Srinivasacharyulu
Further Lights The Veda and the Tantra Kapali Sastri
Gems from the Tantras (Kularnava)
M P Pandit (Ganesh Madras 1969)

Glory of the Divine Mother (Devi Mahatmyam)
S Shankaranarayanan (Deepti Publication Pondicherry 1968)

History of Dharma Sastra— P V Kane Poona 1941

Hindu Mysticism (Part I) Vaishnavism—Mahendranath Sircar Calcutta 1943

Hindu Mysticism— S N Das Gupta (Frederick Ungar Publishing Company New York 1959

Hymns of Alwars (Translated into English verse) J S M Hooper Heritage of India Series 1929

Introduction to Pancha Ratra and the Ahirbudhnya Samhita —F Otto Schrader Adyar Madras 1916

Introduction to Vedanta— P Nagaraja Rao
Bharatiya Vidya Bhavan Bombay 1960

Important Puranas and Itihasas
Jayanthi (Kavya Kantha Sri Ganapati Muni Centenary Commemoration Volume)
Secretary & Editor— Ganti Srirama Murthy (1978)

Origin and Development of Dattatreya worship in India —H S Joshi (Baroda 1965)

Japa Sutram— Swami Pratyagatmananda Saraswati (Ganesh & co Madras)

Krishna Karnamrita— Leela Suka (Edited with three commentaries by S K De Dacca University 1938)

Krishna Karnamrita—Leela Suka (English translation by M K Acharya Vavilla Madras 1958)

Life Divine— Sri Aurobindo (one volume)
Life of Sri Ramanuja— Swami Ramakrishnananda
(Ramakrishna Mission Madras-1965 Second Edition)

Life and Teachings of Sri Madhwacharya
C M Padmanabhachari

Lights on the Tantra— M P Pandit

Lights on the Upanishads— Kapali Sastri

Lord Gouranga— S K Ghose Calcutta

Mysticism in Maharashtra— R D Ranade Poona 1933

Mysticism East and West— Rudolf Otto
(Living Age Books Published by Meridian Books
New York-1957)

Mysticism— Sacred and Profane- R C Zaehner (1961)

Myths and Symbols in Indian art and cirilization—
Heinrich Zimmer 1962

Nayana— (Biography of Kavyakantha Vasishtha Ganapati
Muni)— G Krishna (K V G Muni Trust Madras-
Centenary Publication 1978)

Obscure Religious Cults as Background of Early Bengali
literature - Sasibhushan Dasgupta (Calcutta 1946, 1962)

Outlines of the Philosophy of Sri Madhvacharya—
B A Krishna Swamy Rao

Philosophical Foundation of Bengal Vaishnavism- Sudhindra
Chandra Chakrawarti Academic Publishers Calcutta
1969

Principles of Tantra—(Original Bengali-Pandit Shiva
Chandra Vidyarnava Bhattacharya)Jnanedralal Majumdar
(English Rendering-Ganesh & Co, Madras 1971 )

Quintessence of Sri Vidya (Mahamanustava)
S Shankaranarayanan (Deepti Publications Pondicherry
1969)

Ramanujacharya—A Sketch of his life and times
S K Ayyangar
His philosophical teachings— T Rajagopalachariar

Sakti and Sakta — Sir John Woodroffe

Sankara Deva—Vaishnava Saint of Assam—
Birinchi Kumar Barua (Assam Academy for Cultural Relations Gauhati Assam-1960 )

Savitri— Sri Aurobindo
Select Works of Sankara (G A Natesan & Co Madras 1944)

Sri Chakra—S Shankaranarayanan
(Deepti Publications Pondicherry 1970)

Sri Siddheswari Peetham— Golden Jubilee Souvenir
—Sri Trivikrama Ramananda Bharati Swami
Courtallam 1971

Sri Vallabhacharya Life) Teachings and Movement
—Bhai Manilal Parekh 1943

The Comparison of Religions— R C Zaehner (1958)

The Cult of Vithoba—G A Deleury S J I Ph D
(The Deccan College Poona 1960)

The Gospel of Sri Ramakrishna

The Great Liberation— Sir John Woodroffe

The Holy Mountain— Bhagavan Shri Hamsa
(Translation from Marathi— Purohit Swami—Faber & Faber—1934)

The Last Message of Sri Krishna—Swami Madhavananda
(Advaita Ashrama Calcutta 1956)

The Mother— Sri Aurobindo

The Philosophy of the Srimad Bhagavata—
Siddheswara Bhattacharya (Viswa Bharati-1960)

The Philosophy of Visistadvaita—P N Srinivasachari
Madras-1943

The Philosophy of Srı Madhavacharya— B N K Sarma

The Phılosophy of Sri Nımbarka— J N Sınha

The Phılosophy of Vallabhacharva—Mrıdula J Marfatıa

The Phıiosophy of the Upanıshads—S Radhakrıshnan 1935

Trıpura Rahasya— (With Englıse translatıon)
The Ramanasramam Tıruvamamalaı

Upanıshads (Isa, Kena Katha Prasna Mundaka Mandukya) Taıthırıya Aıtareya Brihadaranyaka Chandogya wıth Notes and Commentarıes — Mahanarayanopanıshad with notes and Cemmentary (Srı Ramakrıshna Math Publications Madras)

Vaishnavism Saıvısm and Mınor Religions—
R Bhandarkar Poona-1913 1928

Varıvasya Rahasya of Srı Bhaskararaya Makhın
—Edıted wıth Englısh Translatıon and Notes— Pandit S Subrahmanya Sastrı (The Adyar Lıbrary and Research Centre, Madras )

Vedanta Phılosophy= S K Belvalkar Poona 1929

Vishnu Sahasranama (Wıth Commentarıes by Srı Sankara Srı Parasara Bhat and Sri Sathyasandha Teertha)

Venkatarama Aiyar T L —
Muthuswamı Dıkshitar (N B T 1968)

శ్రీ రాసపంచాధ్యాయీ-సాంస్కృతిక్ అధ్యయన్ రసక్ బిహారీ జోశీ (ఢిల్లీ 1961)

భాగవత్ సంప్రదాయ్-బలదేవ ఉపాధ్యాయ (నాగరీ ప్రచారిణీ సభా కాశీ)
భారతీయ్ వాఙ్మయ్ మే రాధా-బలదేవ ఉపాధ్యాయ (బిహార్ రాష్ట్రభాషా పరిషద్, పాట్నా)

హిందీ ఔర్ బంగాలీ వైష్ణవకవి-రత్నకుమారి (16వీం శతీ కీ)- భారతీయ సాహిత్య మందిర్ ఫవ్వారా దిల్లీ (1956)

భక్తిరసామృతసింధుః— శ్రీ రూపగోస్వామి (తెలుగు అనువాదం) శ్రీమాన్ ఖొమ్మకంటి శ్రీనివాసాచార్యులు (1992)

ఏ నీ భక్తి వేదాంతస్వామి ప్రభుపాద (ఇంగ్లీషు)

బ్రహ్మసంహితా-జీవగోస్వామి టీక (ఇంగ్లీషు అనువాదం) శ్రీభక్తి సిద్ధాంత సరస్వతి (గౌడీయమఠ్, మద్రాసు 1982)

శ్రీరామచరిత మానస్—గోస్వామి తులసీదాస్

సూర్‌సాగర్ శ్రీసూర్‌దాస్

హిందీ సాహిత్యకా ఆలోచనాత్మక్ ఇతిహాస్-రాంకుమార్ వర్మా, 1938

హిందీ సాహిత్య కా ఇతిహాస్—రామచంద్ర శుక్ల

హిందీ సాహిత్య కీ భూమికా—హజారి ప్రసాద్ ద్వివేది 1940

శ్రీ రాధా కా క్రమవికాస్—దర్శన్ ఔర్ సాహిత్యమేఁ—డా॥ శశిభూషన్‌దాస్ గుప్తా హిందీ ప్రచారక్ పుస్తకాలయ్, వారణాసీ

శ్రీదత్తమాహాత్మ్యమ్(నటిక) రామతత్త్వ ప్రకాశప్రెస్, వేలుగ్రామ (బెల్గాం) 1896

(తెలుగు అనువాదాలు) దత్తమహిమ (వచనము) శ్రీ మిన్నికంటి గురునాథ శర్మ గుంటూరు (1957 1958)

శ్రీదత్తభాగవతము (పద్యకావ్యము) శ్రీ తాదేపల్లి రాఘవ నారాయణశాస్త్రి, చందవోలు (1955)

ద్వైతాద్వైతవివేకః — న్యాయవేదాంతాచార్య శ్రీ భగీరథశర్మ విరచితః— ప్రకాశకః (సానువాదః)

— శ్రీ బృందావన నివాసీ పరమవిరక్తపం శ్రీవిహారీ దాస్‌జీ (స్థాన్ గ తమబుషి మథురా) జైన్‌విజయ ప్రింటింగ్ ప్రెస్-సూరత్ 1945 (మూల్యం—తత్త్వజిజ్ఞాస మాత్రమ్)

సహాయం మిథిలా మహీమండలాంతర్గత ధంగా హరిపుర గ్రామవాస—న్యాయ

వేదాన్తాచార్య మైథిలఝోపాఖ్య శ్రీ భగీరథ శర్మవిరచితః శ్రీకృష్ణపదార్పితశ్చ।

అంతరార్థరామాయణము-డా॥ వేదుల సూర్యనారాయణ శర్మ తణుకు (1981)

ఆచార్యసూక్తిముక్తావళి-శ్రీమాన్ కంబూరి కేశవాచార్యులు

అధ్యాత్మ రామాయణము (గీతాప్రెస్, గోరఖ్‌పూర్)

ఆముక్తమాల్యద-శ్రీకృష్ణదేవరాయలు

ఆముక్తమాల్యదా సౌందర్యము డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు (అనంతపురం-1971)

ఆర్ష విజ్ఞాన సర్వస్వము-ప్రధాన సంపాదకుడు-డా॥ ఎన్ బి రఘునాథాచార్య (తిరుమల-తిరుపతి దేవస్థాన ప్రచురణ-1982)

## ఈశ్వర సత్యనారాయణశర్మగారి రచనలు

శ్రీ కాళిదాస దేసీ పంచస్తవి (1968)
శ్రీ సూక్తరహస్యార్థ ప్రదీపిక (1952, 1970)
శ్రీ సప్తశత్యుపాసనక్రమము (1966)
శ్రీ లక్ష్మీ హృదయము (1967)
సౌభాగ్య లక్ష్మీ హృదయము
సౌందర్యలహరి (1960)
సాధనసామగ్రి (నాలుగు మూటలు)

ఋగ్వేదము (సమూల శ్రీసుదాంధ్ర ఋగ్వేద సంహిత) ఆంధ్రానువాదం-కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి సంకలనం పరిష్కరణ-వాఙ్మయమహోధ్యక్ష, డా॥ వక్లమూడి గోపాలకృష్ణయ్య (తిరుమల-తిరుపతి దేవస్థాన ప్రచురణ 1989)

కామకళా విలాసము (సంస్కృతం-శ్రీ పుణ్యానందముని) తెలుగు వ్యాఖ్య శ్రీ నంహం భట్ల రామమూర్తిశాస్త్రి (వావిళ్ళ మద్రాసు-1959)

## చదలువాడ జయరామశాస్త్రిగారి రచనలు

శ్రీమద్భాగవత దశమస్కంధం (సంస్కృత శ్లోకాలు పోతన తెలుగు పద్యాలు) తత్త్వదర్శినీ వ్యాఖ్యాసమేతం-1971)

సౌందర్యలహరి (శ్రీ శాస్కరరాయలవారి వ్యాఖ్య కు తెలుగు 1968)

## తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి రచనలు

శ్రీచక్ర విలాసము (1969)

శ్రీచక్ర పూజావిధానమ్ (1974)

సౌందర్యలహరి (సమయమోదిని వ్యాఖ్యాసమేతం-1983)

తిరుప్పావై (తమిళం-శ్రీ గోదాదేవి) ఆంధ్రవివరణ-శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు (1986)

ద్వాదశసూరి చరిత్ర-శ్రీమాన్ కె టి యల్ నరసింహాచార్యులు (1973)

నాయన (కావ్యకంఠ శ్రీ వాసిష్ఠగణపతి మునిచరిత్ర) శ్రీ గుంటూరు లక్ష్మీకాంతం (1968)

పరమయోగి విలాసము-శ్రీ తాళ్ళపాక తిరువేంగళనాథుడు

పాణిని అష్టాధ్యాయీ వ్యాఖ్య-(1994)

పాణినీయ శిక్షా

పతంజలి మహాభాష్యమ్

ప్రసన్నామృతమ్-శ్రీమాన్ అనంతాచార్యులు

## పాతూరి సీతారామాంజనేయులుగారి రచనలు

శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రమ్(శాంకరభాష్యాంధ్రవివరణ సహితము-1993)

శ్రీలలితా సహస్రనామ స్తోత్రమ్ (తెలుగు వివరణాదికం-1994)

శ్రీదేవీ మహిమ్నః స్తుతి-శ్రీ దుర్వాసో భగవాన్ (తెలుగువ్యాఖ్య-1994)

పుష్పగిరి భారతి (శ్రీవిద్యారణ్య సంస్మరణమహోత్సవ సంచిక-1986)

శ్రీమదభినవోద్దండ విద్యానృసింహభారతీ స్వామివారు-జగద్గురువులు పుష్పగిరి పీఠాధిపతులు)

---

పూర్వగాథాలహరి శ్రీ వేమూరి శ్రీనివాసరావు

## పేరి సూర్యనారాయణశాస్త్రిగారి రచనలు

పరమార్థసారము (శ్రీకృష్ణప్రెస్ విజయనగరం 1968)

షడ్దర్శనములు (1967)

పోతన భాగవత నీరాజనము (పంచశతి మహోత్సవ సంస్మారిక) 1982 సంపాదకులు ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ )

## పోతాప్రగడ వేంకటసుబ్బారావుగారి రచనలు

శ్రీ గురుదత్త చరిత్ర (1986)

శ్రీ గురుదత్త వైభవము (1987)

భాగవతవాహిని-భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారు (1970)

భాగవతసుధాలహరి (వివిధ సంపుటాలు)డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు (తిరుమల-తిరుపతి దేవస్థాన ప్రచురణ)

భాగవతప్రభ (వివిధ సంపుటాలు)శ్రీ కొత్త రామకోటయ్య (1986 1989)

(శ్రీమత్) భాగవత మహాపురాణమ్ (శ్రీధరస్వామి వ్యాఖ్యతో)

(శ్రీమత్) భాగవతము (వివిధ సంపుటాలు) కులపతి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య విరచిత భాగవత ప్రకాశము

(శ్రీమత్) భాగవతమణిహారము (రెండు సంపుటాలు-వివిధ స్కంధాల నుండి ఎన్నుకొన్న సంస్కృత శ్లోకాలు పోతన తెలుగు పద్యాలు) సంకలన ఆచార్య దర్భా సూర్యనారాయణ, (రాజమహేంద్రవరం, 1981)

భార్గవపురాణము - రాఘవపామానాయకుడు (పీఠిక డా॥ తిరుమల రామచంద్ర)

భారతీయ తత్త్వశాస్త్రము-డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్(తెలుగు అనువాదం డా॥ బులుసు వేంకటేశ్వరులు)

భారతీయ తత్త్వశాస్త్రము-శ్రీ నిర్వికల్పానందస్వామి సాధన, తెనాలి 1960)

మహాభక్త విజయము శ్రీమాన్ మేదేపల్లి వేంకటరమణాచార్యులు

రామాయణరహస్యాలు—శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

రామాయణ శరణాగతి—శ్రీ కేసాప్రగడ సత్యనారాయణ (1991)

వాక్యపదీయము (భర్తృహరి) తెలుగు అకాడమి ప్రచురణ హైదరాబాదు (1974)

శ్రీ చైతన్య మహాప్రభువు (డా॥ సంవిదానందదాసు భక్తిశాస్త్రి ఆంగ్లమూలానికి తెలుగు) శ్రీ నేటూరి భక్తవత్సలం (గౌడీయమఠం గుంటూరు 1970)

శ్రీ చైతన్య చరితామృతము (శ్రీకృష్ణదాసకవిరాజ గోస్వామి వంగమూలాని తెలుగు) శ్రీ యల్లాపంతుల జగన్నాథం (గౌడీయమఠం గుంటూరు 1966)

శ్రీ త్రిపురా రహస్య జ్ఞానఖండసారము బాలప్రియవ్యాఖ్య—శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మ (1992)

శ్రీపతి స్తుతిమాల—జీయరు ఎడ్యుకేషనల్ ట్రస్ట్ సీతానగరం

శ్రీమద్రామాయణము (వాల్మీకము) శ్రీ గోవిందరాజీయమ్

శ్రీ మహావిద్యాసూత్రాది సంగ్రహః (1972) కావ్యకంఠ శ్రీవాసిష్ఠగణపతిముని

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కీర్తనలు (త్రివేణి, మచిలీపట్టణం—1978)

శ్రీ లలితాత్రిశతీభాష్యమ్ (శ్రీ శంకరభగవత్పాదుల భాష్యానికి తెలుగు) శ్రీ గరిమెపాటి కృష్ణమూర్తి (ద్వితీయముద్రణ—1986— భువన విజయమ్, విజయవాడ)

శ్రీ లలితా త్రిశతీ (కుసుమసంజీవని ఆంధ్ర వివరణ) డా॥ ఈశ్వర సీతారామ ధన్వంతరి— శ్రీకాకుళం (సాధన తెనాలి 1985)

శ్రీ లలితాత్రిశతి (తెలుగు వివరణ) డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, తెనాలి

శ్రీ లలితా సహస్రనామ భాష్యమ్ (శ్రీ భాస్కరరాయలవారి భాష్యానికి తెలుగు వివరణ దీధితి 1970) శ్రీ పొంగూరు సూర్యనారాయణశర్మ

శ్రీ లలితా రహస్యనామ సహస్ర గూఢార్థదీపిక శ్రీ రావికొండ వేంకటేశ్వర రావు గుంటూరు—197?

శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్రము (శ్రీ పరాశరభట్టరు వారి భగవద్గుణ దర్పణమునకు తెలుగుసేత) శ్రీమాన్ కిడాంబి రామానుజాచార్యులు (1958)

శ్రీ విష్ణు సహస్రనామములము (త్రిమత భాష్యాలకు తెలుగు వ్యాఖ్య) శాంతిశ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి (1989)

## విద్యాసాగరశర్మ (జి వి ఎల్ ఎన్ ) గారి రచనలు

శ్రీ దత్తమంత్ర సుధార్ణవము (1993)

శ్రీ వాసుదేవానంద సరస్వతీ సద్గురుచరిత్ర (1993)

శ్రీ విశ్వగురు చరిత్ర (1993)

శ్రీ దత్తాత్రేయ షోడశావతారములు (1994)

సప్తశతీ రహస్యాలు (1994)

షోడశీ రామాయణ రహస్యాలు డా॥ గుంటూరు శేషేంద్రశర్మ

సిరినోము (కొన్ని తమిళ పాశురములకు తెలుగు) శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు (1981)

శ్రీ దత్తాత్రేయ కల్పః (1982)శ్రీ పోతుకూచి శ్రీరామమూర్తిః (సాధన గ్రంథమండలి, తెనాలి)

ప॥ప॥ శ్రీ వాసుదేవానంద సరస్వతీ విరచిత గ్రంథాః

స్తోత్రాది సంగ్రహః (1976)

శ్రీ దత్తపురాణమ్ (1977)

సమశ్లోకీ శ్రీ గురు సంహితా (రచన 1906 ముద్రణ 1976)

ద్విసాహస్రీ గురుచరితమ్ (రచన 1884, ముద్రణ 1934)

శ్రీ రామానుజకీర్తి కౌముది (వివిధ సంపుటాలు) శ్రీ వైష్ణవ ధర్మవిజ్ఞాన సర్వస్వము సంపాదకుడు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు గుంటూరు

సూచన- కొన్ని రిఫరెన్సులు' అక్కడికక్కడే మూల గ్రంథంలో చూపించడం జరిగింది.